# చందమామ

పిల్లల మాస పత్రిక





ST JULY '47

6 as.



*Chandamama July '47* *Photo by N. Ramakrishna*

ఇష్టమైనబరువు ఎంతమోసినా కష్టమనిపించదు!

# నెడ్రాస్ హోటల్స్

## (మైకా ఫిబార్)

11, మౌంటురోడ్ ♦♦ మద్రాసు.

●

రుచికరమైన పదార్థాలు

చురుకైన వర్ధన



**'గుప్త' సంస్థయని గుర్తుంచుకొనండి.**

---

# ఈస్ట్ అండ్ వెస్ట్

## ఇన్సూరెన్సు కంపెనీ, లిమిటెడ్, బొంబాయి.

[1913 లో స్థాపితం]

ప్రధాన కార్యాలయం :

'ఈస్ట్ అండ్ వెస్ట్ బిల్డింగ్', ఫోర్టు, బొంబాయి.

33 సంవత్సరాలుగా దేశసేవచేస్తూ జాతీయోన్నతి పెంపొందిస్తూ ఉన్న ప్రముఖ భారతీయ భీమాసంస్థ,

ఆర్థికంగా సుస్థిరమై, పాలసీదార్లతోనూ, ఏజంట్లతోనూ వ్యవహరించుటలో సంస్కారానికి పేరెన్నికగన్న సంస్థ.

1944 లో జరిపిన అదనపువ్యాపారం కోటిరూపాయలు మించింది.

చురుకైనటువంటివీన్నీ, పలుకుబడి కలిగినటువంటివీన్నీ వ్యక్తులు ఏజన్సీలకొఱకు దరఖాస్తులు పెట్టుకోవచ్చును.

**వివరాలకు:**

శ్రీ జె. యస్. రెడ్డి
బ్రాంచి సెక్రటరీ.,
377, ఎస్ప్లనేడ్,
మద్రాసు.

శ్రీ ఎ. వెంకటరెడ్డి
ఇన్స్పెక్టర్ ఆఫ్ ఏజన్సీస్,
మోదుకూరు, వయా—పొన్నూర్,
గుంటూరు జిల్లా.

★

శ్రీ యస్. మల్లికార్జునరావు, ఆర్గనైజింగ్ సెక్రటరీ, బెజవాడ.

అమ్మా!

బాలపాపల ఆరోగ్యం పరిశుభ్రమైన భోజనము మీద ఆధారపడి వుంటుంది. ఇండియా సిరామిక్స్ వారి పింగాణి వస్తువులు అందముగా వుండి, తినే పదార్థములు పరిశుభ్రతగా వుంచుతయ్. మీరు ఇవే నిత్యమూ వాడుక చెయ్యండి.



**ఇండియా సిరామిక్స్ లిమిటెడ్**

**నెల్లూరు :: కాళహస్తి :: మద్రాసు**

*To be sure of your success in English*

# IN THE S. S. L. C. EXAMINATION OF—1948

## BE SURE OF YOUR COPY

OF

**Popular Notes & Text Examiner on The English Prose & Poetry**

BY

**N. PARAMASIVA AIYAR, B. A., L. T.**

*Reputed Head-Master and Author of S. S. L. C. English Notes*

**Rs. 2—8—0**

Supplement your Knowledge by studying

**TEST PAPERS IN ENGLISH I & II PAPER 1-0-0**
(READY ON 1st SEPTEMBER 1947)

Along with the Notes & Examiner on The English Non-Detailed Texts

| | | |
|---|---|---|
| 1. | STORIES FROM TAGORE | 0-8-0 |
| 2. | NAGANATHAN AT SCHOOL | 0-8-0 |
| 3. | MADAME CURIE | 0-8-0 |
| 4. | EXPLORING THE FRONTIERS | 0-8-0 |

*Sole Distributors:*

**PALANIAPPA BROS.**

TEPPAKULAM :: TRICHINOPOLY

# చదవండి!



ఇంకా! ఇంకా!!




సంచాలన: చక్రపాణి

సంపుటి 1 | 1 జూలై 1947 | సంచిక 1

## తెలుగు పిల్లల్లారా!

మీకు ఊహ వచ్చినప్పటినుంచీ నన్ను మీ చిట్టి చిట్టి చేతులతో 'చందమామ రావే, జాబిల్లి రావే', అని పిలుస్తూ ఉండేవాళ్లు. మీరే కాదు; మీలాగా మీ అమ్మ, మీ నాన్న, మీ అవ్వ, మీ తాత, మీ ముత్తవ, మీ ముత్తాత, ఆయన తండ్రి, ఆయన తాత, అందరూ నన్ను 'మామా' అనే పిలిచేవాళ్లు. నేను నవ్వేవాణ్ణి. నా నవ్వుచూస్తే మీకు ఎక్కడలేని సంతోషం. నన్ను తెచ్చిపెట్టమని అమ్మతో పోరు పెట్టేవాళ్లు! చూశారూ? మీరేకాదు, శ్రీరాముడు కూడా వెనక ఇలాగే పోరుపెట్టాడు. అప్పుడు వాళ్ల అమ్మ కౌసల్య ఏమిచేసిందనుకున్నారు? అద్దం

తెచ్చి యిచ్చింది! పాపం, అద్దంలో నా బొమ్మ చూసి నేను వచ్చానని ఏడుపు మానాడు! చూశారూ శ్రీరాముడు ఎంత అమాయకుడో!

అయితే నేను మీ ముత్తాతల, తాతల, తండ్రుల కాలంలో రాలేకపోయాను. కాని ఇప్పుడు వస్తున్నాను. మీకూ, మీ చెల్లెళ్లకూ, అక్కలకూ, అన్నలకూ, తమ్ముళ్లకూ కనిపిస్తాను. క్రింద భూలోకంలో, పైన ఆకాశంలో నేను చూసిన వింతలు, విడ్డూరాలు అన్నీ చెప్పుతాను. నాకు తెలిసిన కథలు, శాస్త్రాలు, పాటలు, పదాలు, గమ్మత్తులు, అన్నీ మీకు వినిపిస్తాను. ఇదుగో ఇప్పుడు కొన్ని చెప్పుతున్నాను. ఇప్పటికివి చాలుకదూ? చాలకపోతే నాకు చెప్పండి. వచ్చే నెల వాటి అన్నిటితో మీ దగ్గరికి వస్తాను.

మీ
చందమామ.



# ఆహ్వానము

★

చందమామా రావే, జాబిల్లి రావే
రైలెక్కి రావే, రష్యా కధలు తేవే
ఇంజనెక్కి రావే, ఇంగ్లీషు కధలు తేవే

బస్సెక్కి రావే, బాంగ్లా కధలు తేవే
కారెక్కి రావే, కాంమ్రేడ్ కధలు తేవే

హారన్ ఊత్తూ రావే, ఆకలికధలు తేవే
కొండెక్కి రావే, కోటి వేలు తేవే

ఒలిచిన చోకలేట్లు ఒళ్లో పెట్టుకొని
కరిగిన ఐస్‌క్రీం చేత్తో పట్టుకొని
అలా అలా అలా వచ్చి, మా
తెలుగుపిల్లల తీపి నోట్లో పోసిపోవే.

చలం; దీక్షితులు

CHITRA

# ఉడత పాటలు

కృష్ణశాస్త్రి

సీత

ఏరోప్లేన్ తెచ్చావా, ఉడతా, ఉడతా, నే
యూరోపు వెళ్లాలి ఉడతా, ఉడతా!

ఉడత

హోరుగాలి కొట్టొచ్చు,
కారుమబ్బు పట్టొచ్చు,
ఏరోప్లేను తేలేను సీతా, సీతా, నే
యూరోపు రాలేను సీతా, సీతా!

సీత

స్టీమరేనా తెచ్చావా, ఉడతా, ఉడతా, నే
సీమ కెళ్లి రావాలి, ఉడతా, ఉడతా!

ఉడత

ఏ తుపాను వస్తుందో!
ఏ కెరటం లేస్తుందో!
స్టీమరేనా తేలేను సీతా, సీతా! నే
సీమకేనా రాలేను సీతా, సీతా!

సీ త

రైలుబండి తెచ్చావా ఉడతా, ఉడతా, నే
రామేశ్వరం వెళ్లాలి ఉడతా, ఉడతా!

ఉ డ త

అడుగడుక్కి వంతెనలు,
నడుమ నడుమ సొరంగాలు,
రైలుబండి తేలేను సీతా, సీతా, నే
రామేశ్వరం రాలేను సీతా, సీతా!

సీ త

కారుగాని తెచ్చావా ఉడతా, ఉడతా, నే
కాకినాడ వెళ్లాలి ఉడతా, ఉడతా!

ఉ డ త

పెద్ద బస్సు లెదురొస్తయ్,
ఎద్దుబళ్లు అడ్డొస్తయ్,
కారైన తేలేను సీతా, సీతా, నే
కాకినాడ రాలేను సీతా, సీతా!

సీ త

సైకిలైన తెచ్చావా ఉడతా, ఉడతా, నే
సరదాగా వెళ్లాలి ఉడతా, ఉడతా!

ఉ డ త

మలుపు గిలుపు తిరగాలి,
మనిషొస్తే ఒరగాలి,
సైకిలైన తేలేను సీతా, సీతా, నే
సరదాగా రాలేను, సీతా, సీతా!

బొందమూవః



# జిత్తులమారి
# నక్క బావ

అనగా అనగా ఒక అడివిలో ఒక నక్క ఉండేది. అది చాలా జిత్తుల మారిది. అది ఎక్కడినించి వచ్చిందో, ఎప్పుడు వచ్చిందో ఎవరికీ తెలియదు. దానితరహా అంతా చిత్రంగా ఉండేది. అందుకని మిగతా నక్కలన్నీ "నువు మా కులముదానివేకాదు పొ" మ్మన్నవి. దానితో మాట్లాడటంకూడా మానివేసినై.

ఇక నక్క ఏమిచేస్తుంది? అక్కడ తన ఆటలు సాగకపోయేవరకు అడివికి దగ్గరగా ఉన్న ఊరు పోయి అక్కడ మంగలివానితో స్నేహం చేసుకున్నది. పాపం, ఆ మంగలి చాలా మంచివాడు. అతనికి ఈ నక్క సంగతి తెలియదు. పైగా నక్క చాలా పెద్దమనిషి లాగా తియ్యతియ్యగా మాట్లాడేది. అది నిజమని మంగలి నమ్మాడు.



వాళ్లిద్దరికీ మంచిస్నేహం కలిసింది. ఒకనాడు నక్క మంగలితో అన్నది కదా—"మంగలి మామా, మంగలి మామా! మనం పళ్లతోట వేసుకుంటే ఎట్లా ఉంటుంది? మనం తిన్నన్ని తినవచ్చు, మిగతావి అమ్ముకుని పొది నిండా డబ్బులు పోసుకోవచ్చు."

పాపం మంగలికి ఈ మాటలు వినేవరకు నోరు వూరింది. మామిడి మొక్కలు, సపోటామొక్కలు, అరిటి మొక్కలూ తెచ్చి తోటవేశాడు. అక్కడక్కడా గుమ్మడిపాదులూ, దోసపాదులూ పెట్టాడు. తనూ పెళ్లామూ కలిసి పాదులుచేసి, నీళ్ళు తెచ్చి, చెట్లకు పోసేవాళ్ళు. నక్క పైన కర్రపెత్తనం చేస్తూ కావిలి కాస్తున్నాననేది.

కొన్నాళ్లకు తోట కాపుకు వచ్చింది. నక్క

రాత్రంతా మేలుకుని కడుపు ఉబ్బేదాకా, పళ్ళు కాయలు మెక్కేది. ఒక్క పండు కాయ కనపడనిచ్చేది కాదు.



ఒకనాడు మంగలి "నక్కబావా, నక్కబావా! తోటలో కాయలేమైనా ఉన్నాయా?" అని అడిగాడు. "ఇప్పుడెక్కడివి? వానాకాలం వస్తేగా దొరికేదీ?" అన్నది నక్క. పాపం, మంగలి నమ్మాడు. వానాకాలంవచ్చినాక అడిగాడు. "వానాకాలంలో ఎక్కడన్నా కాయలు ఉంటాయా? చలికాలం రావాలి!" అన్నది. చలికాలం వచ్చినాక అడిగితే, "పిచ్చివాడా! చలికాలంలో కాయలు దొరుకుతాయా, పిందెలు ఉంటాయి. ఎండాకాలంలో అడుగు," అని ఇట్లా ఏదో ఒకసాకు చెప్పుతూ మంగలిని ఒక్క కాయ తిన నివ్వలేదు. ఇంతలో ఎండా కాలం వచ్చింది. కాయలు కాచినై. నక్క ఒకనాటి రాత్రి అడివికిపోయి మిగతా నక్కలతో చుట్టరికం కలుపుకోవాలని వాటినన్నిటినీ విందుకు పిలిచింది. అవి వచ్చి, పొట్ట పట్టినన్ని తిని, మిగతావి తుంచి, కొరికి, మట్టిలో పారవేసిపోయి చక్కా పండుకొన్నవి.



పాపం, మర్నాడు పొద్దున మంగలి వచ్చి తోట చూసుకుంటే కళ్ళవెంబడి నీళ్ళు వచ్చినై. చెట్లుని ఒక్క కాయ లేదు. ఒక్కమూలనుమాత్రం గుమ్మడి పాదుకు ఒక గుమ్మడికాయ ఉంది. అదీ ఆకులు కమ్మిఉండటం మూలాన కనపడటంలేదు. నక్కచేసిన మోసానికి దాన్ని దండించాలనుకున్నాడు మంగలి. ఇంటోకిపోయి పొదిలోనుంచి మంగలి కత్తులు తీసి బాగా సానపట్టి గుమ్మడి కాయకి చుట్టూ కట్టాడు. ఆ కత్తులు కనపడకుండా ఆకులు అడ్డం పెట్టి, ఇంటికిపోయి హాయిగా నిద్రపోయాడు.



మర్నాడురాత్రి తిరిగ్గా నక్క వచ్చింది. దానికి బాగా ఆకలి వేస్తున్నది. తోటలో కాయలన్నీ తోటినక్కలు అదివరకే పాడుచేసినై. తోట అంతా గాలించటం మొదలుపెట్టింది. ఆఖరికి ఆ గుమ్మడికాయ కనపడింది. అది అతి ఆశతో ఒక్కమాటుగా గుమ్మడికాయ మీద దూకింది. ఇంకేం, దానివొళ్లంతా తెగింది. నెత్తురు కారటం మొదలు పెట్టింది. వొళ్లంతా మంటలు. ఏడ్చుకుంటూ, కాళ్ళీడ్చుకుంటూ పోయి ఒక రాతిమీద కూర్చున్నది. చాలాసేపటిదాకా నెత్తురు కారిపోతూనే ఉన్నది. ఇక ఇలాంటి తప్పుడుపని చెయ్యకూడదని మనసులోకున్నది. మంగలిని దొంగ ముండా కొడుకని తిట్టింది. ఎన్నితిట్టినా, ఎవరిని తిట్టినా దానినొప్పి తగ్గుతుందా? నెత్తురు కారకుండా ఉంటుందా? నెత్తురు కారటం ఆగినతర్వాత బయలుదేరుదామనుకున్నది. కాని ఆ నెత్తురు ఎండి గడ్డకట్టి అందులో ఇరుక్కుపోయింది. అందులోంచి కదలాలేదు, మెదలాలేదు. నక్కకి మంగలిమీద భలేకోపం వచ్చింది. "నన్ను ఇందుట్లోనించి బయటికిరానియ్యి వీడిపని పట్టకపోతే!" అని శపథం చేసింది.

పాపం! ముందు ఇది బయటపడితే కదా మంగలిపని పట్టటానికి. అబ్బాయిలూ, మనంకూడా చూద్దాము, నక్కవాడిపని ఎట్లా పట్టుతుందో!






అనగా అనగా ఒక ఊరు. ఆ ఊరి బైట వాముల దొడ్లో ఒకపిల్లి ఉండేది. దానికో బుల్లి పిల్లికూన పుట్టింది. పాపం! పిల్లికూనని కన్న వెంటనే దాని తల్లి చచ్చిపోయింది. తల్లి లేని పిల్లికూనకి పిల్లిభాష తెలియనేలేదు.

పిల్లికూనకి ఆకలివేసింది. పాలు కావాలి. కాని, ఎలా అడగాలో తెలియ లేదు దానికి.

పాపం, ఆకలితో ఆవు రావురు మంటూ పిల్లికూన వీధిలో పడింది. ఏడుస్తూ నడుస్తోంది. దారిలో దానికొక కుక్కపిల్ల కనబడింది. పిల్లికూనని కుక్కపిల్ల అడిగిందిగదా:

'పిల్లికూనా పిల్లికూనా
గళ్లగళ్ల పిల్లికూనా
కళ్లనీళ్ల ఎందుకమ్మా?'

ఏడుస్తూనే అంది పిల్లికూన:

'కుక్కపిల్లా! కుక్కపిల్లా!
ఒక్కసంగతి చెప్పగలవా?
ఆకలేస్తే పాలకోసం
అమ్మనేమని అడుగుతావ్?'

కుక్కపిల్ల అంది:

'భౌభౌమని అరుస్తాను
పసందైన కుక్కభాష
పాలు నీకుకావాలా
భౌభౌమని అరిచిచూడు.'



మా యా దే వి

*





పిల్లికూన అంది :

'భౌభౌమని అరవలేను
బాగులేదు కుక్కభాష
మాతృభాషతప్ప నాకు
మరోభాష వద్దు వద్దు.'

అని పిల్లికూన అక్కణ్ణుంచి వెళ్లిపో యింది. దారిలో కోడెదూడ కనబడింది. అడిగితే,అంభా అని అరవమంది. పిల్లి కూనకి ఆ భాషా నచ్చలేదు. కాకిపిల్ల కనబడింది. కాకా అని అరవమంది. కప్పపిల్ల కనబడింది. బెకబెకమని పిలవమంది. మేకపిల్ల కనబడింది. మేమే అని అడగమంది.

పిల్లికూన ఏడుస్తూ వెళ్లిపోయింది. ఈ భాషలేవీ నాకు వద్దనుకుంది.

ఆఖరికి ఒక పెద్దపిల్లి కనబడింది. ఏడుస్తున్న పిల్లికూనని బుజ్జగించి,

'పిల్లికూనా, పిల్లికూనా
ఎందుకమ్మా ఏడుస్తావ్?'

అని అడిగింది.

'ఆకలేస్తే పాలకోసం
అమ్మ నేమని అడుగుతావ్'
అని అడిగింది పిల్లికూన.





"మ్యావ్ మ్యావ్ మ్యావ్ మ్యావ్" అని బోధించింది పెద్దపిల్లి.

పిల్లికూనకి తల్లిభాష దొరికింది. మ్యావు మ్యావు మని పాడుకుంటూ ఒక ఇంట్లోకి వెళ్లింది. ఆ యింట్లో శారద అనే అమ్మాయి ఉంది. "మ్యావు మ్యావు" అంది, తల్లిలేని పిల్లికూన. శారద దానిభాష తెలుసుకుంది.

"ఓహో! ఆకలేస్తోందా పిల్లికూనా, పాలు తెస్తాను తాగు"అని శారద ఒక పళ్లెంనిండా పాలుపోసి తెచ్చింది. పిల్లి కూన సంతోషంతో పాలన్నీ తాగింది. తరవాత పిల్లికూనా, శారదా చాలాసేపు ఆడుకున్నారు. ఆఖరికి అలసిపోయి శారద నిద్రపోయింది. పిల్లికూనకూడా ఒకమూల హాయిగా నిద్రపోయింది.

ఇక కథ కంచికీ, మనం ఇంటికీ.



# తెనాలి రామలింగం

తెనాలి రామలింగం పేరు తెలియని పిల్లలు ఉండరు. అతని కాపేరు ఎలా వచ్చిందనుకున్నారు? తెనాలిలో పుట్టాడు కనుక తెనాలి రామలింగ మయాడు. ఆ రోజుల్లో తెనాలి చిన్న ఊరు.

చిన్నప్పటినుంచి రామలింగం వట్టి చిలిపివాడు. ప్రతివాళ్లనీ పేర్లు పెట్టే వాడు. అతనికి నదురు బెదురు ఏ కోశానా ఉండేది కాదు. తనకు నచ్చనిదాన్ని వెక్కిరించటంలో మొనగాడు.

ఒక రోజున రామలింగం వీధిలో ఆడుకొంటూవున్నాడు. ఒక యోగి ఆ దారిని పోతూ అతన్ని చూచాడు. రామలింగం రూపురేఖల్లోనూ, అతని మాటల్లోనూ యోగికి తెలివితేటలు కనిపించాయి. వెంటనే ఆయన రామలింగాన్ని దగ్గరకు పిలిచి శక్తి మంత్రం ఉపదేశించి యిలా చెప్పాడు:

"నాయనా! ఈ మంత్రం వెయ్యిసార్లు కాళికాదేవి గుడిలో జపిస్తే, దేవి నీకు ప్రత్యక్ష మౌతుంది. వెయ్యి తలలతో కనిపిస్తుంది. నీవు భయపడగూడదు. అప్పుడు దేవి మెచ్చి నీవు కోరుకొన్న వరం ఇస్తుంది," అని చెప్పి యోగి వెళ్లి పోయాడు.

ఒక మంచిరోజు వచ్చిందాకా ఆగి, ఆ నాటి అర్ధరాత్రిపూట రామలింగం ఒంటరిగా కాళికాదేవి గుడికి వెళ్లి యోగి చెప్పిన మంత్రం వెయ్యిసార్లు జపించాడు. కాళికాదేవి వెంటనే వేయి తలలతో ప్రత్యక్షమైంది. రామలింగం భయపడలేదు. అతనికి ఏమితోచిందో ఏమో ఫక్కున నవ్వాడు.

దేవి రామలింగాన్ని "ఎందుకు అబ్బాయీ, నవ్వుతా?" వని అడిగింది.

"మీరు కోపగించుకోమంటే మనవి చేసుకొంటాను," అన్నాడు జంకు గొంకూ లేకుండా రామలింగం.



దేవి సరేనన్నది. రామలింగం అప్పుడు చెప్పాడు:—

"అమ్మా! మాకు ఒకటే ముక్కు, కాని రెండుచేతులున్నాయి. ఎప్పుడన్నా జలుబు చేస్తే ఈ ఒకముక్కు చీదుకోటానికే రెండుచేతులు చాలటంలేదు. ఇక మీకా వెయ్యితలలు. కర్మంజాలక జలుబుచేస్తే ఆ వెయ్యిముక్కులు చీదుకోటానికి ఈ రెండుచేతులు ఎలా చాలుతాయా అని నవ్వు వచ్చింది."

దేవికూడా అతనిమాటకు నవ్వి— "నాయనా, నన్నుచూచి నవ్వినవాడివి ఇక నువ్వు ఎవరిని చూచి నవ్వవు గనుక. నీవు తప్పకుండా వికటకవి వవుతావు," అంది.

రామలింగం నమస్కరించి "తల్లీ ఎటుతిప్పి చదివినా చెడనిమాట వరంగా ఇచ్చావు. ఇంతకంటే నాకు ఏమికావాలి," అన్నాడు.

కాళిక అతని తెలివితేటలకు మెచ్చుకొన్నది. 'వికటకవి' అనే మాట ఎటు తిప్పిచదివినా మారేది ఏమి ఉంది? దేవి సంతోషించి మరొక వరంకూడా అతనికి ఇచ్చింది. "నీవు రాజాస్థానంలో విదూషకుడ వవుతావు. అంతే కాదు. నీలాగా పద్యం కూర్చటం మరొకరికి చేతకాదు." అని ఆశీర్వదించింది.

రామలింగం వికటకవిగా ప్రసిద్ధికెక్కాడు. ఆయన పేరుతో ఎన్నో హాస్య కథలు ఉన్నాయి. ఇవికాక వీరు రెండు మహాకావ్యాలు వ్రాశాడు. ఉద్భటారాధ్య చరిత్ర ఒకటీ. పాండురంగ మాహాత్మ్యం రెండూ.



పెద్దవాళ్లయినాక మీరు వాటిని చదువుతారు కదూ.



# పండుటాకుల పాట

అనగా అనగా ఒక పెద్ద రావిచెట్టు. ఆ చెట్టు కొక పెద్దకొమ్మ. ఆ కొమ్మ కొక చిన్న రెమ్మ. ఆ రెమ్మ కొక చిన్ని చిగురుటాకు. చిగురుటాకును గాలి చల్లగా జోకొట్టింది. సూర్యకిరణాలు వెచ్చగా మేలుకొలిపాయి. ఆనందంతో ఉబ్బిపోయింది, చిగురుటాకు.

ఇంతలో ఒకపాట సన్నగా వినిపించింది. ఈ పాట చుట్టుపట్ల చెట్లమీదినుంచి సన్న సన్నగావచ్చింది. ఈ పాటను పండుటాకులు విన్నాయి. అవికూడా పాట అందుకున్నాయి. రావిచెట్టుమీది పండుటాకులన్నీ పాడసాగాయి.

చిగురుటాకు ఈపాట విన్నది. ఈ పాట ఏమిటో దానికి అర్థం కాలేదు. 'పండుటాకులు రాలే వేళయింది' అని చెప్పింది పక్క ఆకు.

రాలి కిందపడటంలో ఆనందం ఉండి ఉండాలి అనుకున్నది చిగురుటాకు. రాలి కిందపడే భాగ్యం తనకు లేదే అని విచారించింది చిగురుటాకు.



చిగురుటాకు తన విచారాన్ని రెమ్మకు చెప్పింది. రెమ్మ మండకు చెప్పింది. మండ కొమ్మకు చెప్పింది. కొమ్మ బోదెకు చెప్పింది. బోదె తల్లిచెట్టుకు చెప్పింది.

తల్లిచెట్టు బోదెతో చిగురుటాకుకు ఈ విధంగా కబురుచేసింది:

“చిగురుటాకును విచారించవద్దను. నన్నే అంటిపెట్టుకుని ఉండమను. నేనిచ్చే ఆహారం ఆరగించమను. ఎండలో చలి కాచుకోమను. గాలిలో ఆడుకోమను. పండుటాకుల పాటపాడే సమయం దానంతట అదే వస్తుంది. అప్పటిదాకా ఆగమను.”

ఈమాట బోదె కొమ్మకు చెప్పింది. కొమ్మ మండకు చెప్పింది. మండ రెమ్మకు చెప్పింది. రెమ్మ చిగురుటాకుకు చెప్పింది.

“అమ్మ చెప్పినట్టే చేస్తానులే,” అన్నది చిగురుటాకు.

అది తల్లినే అంటిపెట్టుకున్నది. ఎంతో ఆహారం తీసుకున్నది. ఎండలో చలి కాచుకున్నది. గాలిలో ఆడుకున్నది. పెరిగి పెద్దదై ముదురు ఆకుపచ్చ రంగుకు తిరిగింది. క్రమంగా దానిరంగు తేలిక ఆకుపచ్చగా మారింది. తరవాత పసుపు పచ్చగా అయింది.

మళ్లీ పండుటాకులపాట వినిపించింది. పండిన ఈ ఆకు కూడా ఆపాట విన్నది. మిగిలిన పండుటాకులతోపాటు పాడ నారంభించింది. పాట తెచ్చిన గాలి మెల్లిగా పండుటాకును చెట్టునుంచి వేరుచేసింది.

పండుటాకు మెల్లిగా గాలిలో తేలుతూ క్రింద పడిపోయింది.

కింద అనేకమైన ఎండుటాకు లున్నాయి. వాటిమధ్య పడి పండుటాకుకూడా వాటిలాగే దీర్ఘనిద్ర పోయింది.






చూడామణి

ఎంతో ముచ్చటపడి మా అమ్మా నాన్నా నాకు శ్రీరామచంద్రమూర్తి వారిపేరు పెట్టుకున్నారు. పేరుపెట్టారే కాని అంతపొడుగుపెట్టి పిలవటానికి వాళ్లకే ఓపిక లేకపోయింది. అదీకాక నావంటి చిన్నిబుర్రగలవాడికి ఇంతపెద్ద పేరుదేనికీ? అందుచేత నాపేరు కుదించి 'రాముడు' అన్నారు. ఐతే, ఊళ్లోవాళ్ల ఈ పేరుకు ముందు రకరకాల తోకలు తగిలించారు. విష్ణుమూర్తికి వేయినామా



లుంటే నాకు రెండువేలున్నాయి—బండ రాముడు, మొద్దురాముడు, రాచ్చిప్ప రాముడు, తిక్కరాముడు, మట్టిబుర్ర రాముడు, అడ్డతలరాముడు, పిచ్చి రాముడు, వెర్రిరాముడు, మన్నుతిన్న రాముడు, నిద్రమొహంరాముడు, దున్న పోతు రాముడు....ఇలా ఎన్నో. మీకు కూడా ఏదన్నా మంచిపేరు దొరికితే దానితో నన్ను పిలిచుకోండి. నాకేమీ అభ్యంతరం లేదు. కాని నాకుమాత్రం ఈ పేర్లన్నిటిలోకీ బండిరాముడనే పేరు బాగుండేది. ఆ పేరుతోనే జాస్తిగా నన్ను పిలిచేవాళ్లు.

మా అమ్మ నన్ను, "రా....ము.... ....లూ!" అని చాలా పొడూగ్గా పిలిచేది. మా నాన్నమటుకు నన్ను రకరకాలుగా పిలిచేవాడు. ఆయన ఒకసారి పలికి నట్టు మరొకసారి పలికేవాడుకాదు.

నాపేరుతో మానాన్న నవరసాలూ ఒప్పించేవాడు.

ఒక దసరా పండగనాడు నాకు అక్షరాభ్యాసం చేశారు. ఆ ముహూర్త బలిమిఏమో కాని నేను ఎప్పుడు పుస్తకం పట్టుకున్నా, అది నాచేతిలో తలకిందు గానే ఉండేది. "పుస్తకం సరిగా పట్టు కోరా, పశువా" అని మానాన్న మొట్టిన మొట్టికాయలూ, తిట్టినతిట్లూ, పెట్టిన తొడపాశాలూ ఇన్నన్నికావు.

"మొద్దు వెధవ! వెయ్యి పుటాలు వేసినా వీడికి చదువురాదు. వెనకజన్మ లో వీడు ఏ గాడిదో అయిఉండాలి." అని చెప్పేశాడుమానాన్న, విసుగుపుట్టి.

అక్షరాభ్యాసం అయిన నాటినుంచీ నేను ఒక్క విద్యమాత్రం బాగానేర్చా. అదేమిటంటే దెబ్బలుతినటం. తోటి వాళ్లంతా నన్నే కొట్టేవాళ్లు; ఇరుగు పొరుగువాళ్లుకూడా, తమపిల్లలకు తగల వలసిన దెబ్బలు నాకే తగిలించేవాళ్లు; పైగా మాయింటికివచ్చి, "మీ రాము డిట్లా చేశాడు, అట్లా చేశాడు" అని ఫిర్యాదు చేసేవాళ్లు. మానాన్న నన్ను



చావకొట్టేవాడు; ఇక మా అమ్మకూడా నాలాంటి గాడిదను కని, ఊళ్లోవాళ్ల చేతా మానాన్నచేతా దెబ్బలుపడటానికి వప్ప చెప్పినందుకు, కోపంవచ్చి నన్నేకొట్టేది. దీనికితోడు మానాన్నదగ్గిర నేను ఎనిమిది నెలలపాటు చదువుకున్నాను. అయిదు ఏళ్లూ నాకు వచ్చేలోగా ఎన్నిదెబ్బలు తినిఉంటానో మీరే ఊహించుకోండి. ఇలా దెబ్బలు తినడంవల్ల నావొళ్లు బండబారి పోయింది. అందుకనేనేమో నాకు బండరాముడు అంటే ఇష్టం.

చిన్నతనంలో నాకు తెలివిగలపనులు చెయ్యాలని ఉండేది. మంచిపనులూ చెయ్యాలని ఉండేది. దెబ్బలు తినటం అలవాటయినకొద్దీ ఈ ఉద్దేశం అడు



గంటింది. దెబ్బలభయం మూలకంగా ఏపనిచెయ్యాలన్నా భయమే. అదీకాక ఏపనిచేసినా దెబ్బలే తగులుతున్నప్పుడు మంచిపనులేవో, చెడ్డపనులేవో తెలుసు కోవటం ఎలా? అందుచేత నాకు మంచీ చెడూ తెలుసుకునేశక్తిపోయింది. నేను సాధువునయాను. నా మెత్తతనం చూసి కొందరు నన్ను మొద్దురాము డనేవాళ్లు.

ఇంక నాకు పెద్దచదువులు చెప్పటం మానాన్నవల్లకాలేదు. అందుచేత నన్ను ఒకబడిలో వేశారు.

నన్ను ఒకటోక్లాసులో చేర్చుకున్నారు. మా క్లాసులోకల్లా నేనే పొడుగు. వయసులోకూడా నేనే అందరికన్నా పెద్ద. అందుచేత మిగిలినవాళ్లకెవరికీ తెలియని విద్య ఒకటి నాకుతెలుసు. అదేమి టంటే, చచ్చినా నోరు విప్పకపోవటం. నన్ను కొట్టినప్పుడల్లా పెద్దవాళ్లు, "నోరు మూసుకో, వెధవా! నోరుమూసుకో!" అనేవాళ్లు.

వాళ్ళ ఉద్దేశం నేను పైకి ఏడవ రాదనో, మాట్లాడరాదనో నాకు తెలి యదు. నేనుమాత్రం నోరు మూసుకో వటం నేర్చుకున్నా.

ఒకరోజు సాయంకాలం, క్లాసులో మా మేష్టారు పిల్లకాయల్ని, "ఏం కథ చెప్పమన్నారు?" అని అడిగారు. పిల్లకాయలెవరూ మాట్లాడలేదు. నా పక్కన ఉన్న పిల్లవాడు నా చెవిలో, మాయలేడి కథ చెప్పమని అడుగు", అని రహస్యంగా ఊదాడు. "మేష్టారూ, మాయలేడి కథ చెప్పండి," అన్నాను. ఎందుకోగాని పిల్లకాయలంతా గొల్లున నవ్వారు.

మేష్టారికళ్లు చింతనిప్పులల్లే అయాయి. ఆయనపళ్లు పటపటా కొరుకుతూ అంబశక్తికి మల్లే ఒక్కొక్కఅడుగే వేసుకుంటూ, చేతిలో బెత్తం ఊపుతూ,

"కోతివెధవా, పుండాఖోర్, బద్మాష్" అని తిడుతూ నామీదికివచ్చాడు. ఎన్ని దెబ్బలు తిన్నానో నేను లెక్క పెట్టలేదు. ఆ దెబ్బలతో ఆయనకోపం తీరిందో లేదో తెలియదు. అసలాయన నన్నెందుకు కొట్టిందీ, నేనేం తప్పుచేసిందీకూడా నే నెరగను. వాచిన కళ్లతో, బూరెలాగా పొంగిన వీపుతో ఇంటికి వెళ్లేటప్పుడు మా క్లాసు పిల్లకాయ ఒకడు నాతో చెప్పాడు: మేష్టారిపేరు రమణయ్యట; ఆయన చకచక ఎవ్వరికీ అందకుండా నడుస్తాడట. అందుచేత ఆయనకు మాయలేడి అని పేరుపెట్టారట. అందుకనేనట ఆ పేరంటే ఆయనకు కోపం.

మర్నాడు నాకు బడికిపోటానికి బుద్ధి పుట్టలేదు. కాని మానాన్న మొట్టికాయలకంటే పంతులుగారి బెత్తమే నయమని వెళ్లాను. మేష్టారు నిన్న అనవసరంగా నన్ను కొట్టినందుకు ఇవాళ చాలాబాగా చూశారు. ఇవాళ మేష్టారికి డ్రాయింగు బొమ్మ వెయ్యబుద్ధయింది. చాక్‌పీసు తీసుకుని తేలుబొమ్మ వేస్తూండగా ఆయనకు పొడుంపీల్చవలసిన అవసరం



వచ్చింది. రొండినుండి పొడుండబ్బీ తీసిచూస్తే అందులో పొడుములేదు.

ఆయన నాకేసిచూసి, నవ్వి, ఎంతో అపేక్షగా, "ఒరే, నాయనా, రాముడూ, ఇలారా", అన్నాడు. నాకు చెమటలు పోశాయి. కాళ్లు వణుకుతూ ఆయన దగ్గిరికి వెళ్లా. "ఒరే, అబ్బాయీ. ఈ పక్క దుకాణానికి వెళ్లి ఒక అర్ధణా నస్యం వేయించుకు రాగలవూ?" అన్నాడు. "వేయించుకు వస్తానండీ. నాకు దుకాణాలకు వెళ్లటం అలవాటే. మా వీధిలో వాళ్లందరికీ సరుకులు నేనే తెచ్చిపెడతాను. ఇవ్వండి," అన్నాను ఉత్సాహంతో. ఆయనదగ్గిర పొడుము డబ్బీతోపాటు రెండు కాన్లు తీసుకుని బయటికి పరుగెత్తాను.




దుకాణంవాడికి పొడుముడబ్బీ, డబ్బులూ ఇచ్చి, పక్కనే గారడీ జరుగుతుంటే తొంగిచూశా. గారడీవాడు తురకంలో ఏదో చెబుతున్నాడు. వాడితో ఇంకొకడు పాడుతూ డోలు కొడుతున్నాడు. "ఓ అబ్బాయిలూ, మీలో ధైర్యంగలవా డెవడైనా ఇట్లా రండి", అని గారడీవాడు పిలిచాడు. ఎవరూ రాలేదు. గారడీవాడికళ్లు నామీద పడ్డాయి. నామనసు ఊగింది పోవాలని. కాని మేష్టారిపొడుముడబ్బీ, బెత్తమూ జ్ఞాపకం వచ్చి, గబగబా దుకాణం దగ్గిరికిపోయి అక్కడఉన్న డబ్బీ తీసుకుని బడికి పరుగెత్తా. డబ్బీ మేష్టారి బల్లమీద పెట్టి వచ్చి మళ్లీ నాచోటులో కూర్చున్నా.

మేష్టారు తేలుబొమ్మవేసి బల్లదగ్గిరికివచ్చి చూసుకునేసరికి బల్లమీద నిప్పుపెట్టె ఉంది. ఇదేమిటని దాన్ని తెరిచిచూసేసరికి అందులోనుంచి ఒక తేలుపిల్ల బయటికి వచ్చింది. "రాముడు మేష్టారికి తేలుపిల్ల బహుమానం తెచ్చాడు", అని క్లాసులో పిల్లకాయలు అరిచారు. నావీపు చెడింది అనుకున్నా.

"పొడుమేదిరా, రాముడూ?" అని అయ్యవారడిగాడు. అప్పుడు నాకు తెలిసింది, నేను పొడుముడబ్బీకి మారుగా ఎవరో అల్లరి పిల్లకాయపెట్టిన నిప్పుపెట్టె తెచ్చానని.

"ఇప్పుడేవెళ్లి క్షణంలో తెస్తానండీ", అంటూ మళ్లీ దుకాణానికి దౌడుతీశా.

నాస్థితి కనిపెట్టి దుకాణదారు నన్ను చాలాసేపు ఏడిపించి, నాచేత నీళ్ల తెప్పించి, దుకాణం ఊడ్పించి, ఆఖరుకు డబ్బీ ఇచ్చి పంపించాడు. ఆవిధంగా ఆ రోజు భగవంతుడి అనుగ్రహంవల్ల నాకు దెబ్బలు తప్పాయి. పొద్దున్నే లేచి ఎవరిదో మంచిమొహం చూసి ఉంటా.



నారద కేసరి

# కాకమ్మ కథ

కాకులు పురాణకాలంనించికూడా ప్రసిద్ధిగన్నవి. వెనక ఎప్పుడో ఒక కాకి అగస్త్యుడి కమండలం ఒలకబోసిందట. అప్పుడు అందులో ఉన్న గంగ బయటికి వచ్చి నదిగా ప్రవహించింది. శ్రీరామచంద్రుడు సీతతో అరణ్యంలో ఉన్నప్పుడు ఒకనాడు ఒక కాకివచ్చి సీతామహాదేవి రొమ్ముమీద పొడిచింది. రాముడికి కాకిమీద ఆగ్రహం వచ్చింది. దగ్గిరఉన్న గడ్డిపరక ఎత్తి కాకిమీద విసిరాడు. కాకి భయపడి మూడులోకాలూ తిరిగింది. రక్షించేవారు లేక ఆఖరుకు రామచంద్రుడినే శరణువేడింది. కాకికి ప్రాణం దక్కిందిగాని ఒక కన్ను పోయింది.

ఆనాటినుంచీ కాకులకు ఒంటికంటి చూపే.

కాకి ఎట్లా చూస్తుందో మీ రెరుగుదురుగాదూ?

కాకులలో ఉన్న కొన్ని మంచి లక్షణాలు మనుషులలో కూడా లేవు. వాటిలో వర్ణభేదంలేదు. అందుకనే 'తెల్లనికాకులునులేవు తెలియర సుమతీ' అన్నాడు కవి. కొన్నికాకులను మనం మాలకాకులంటాం. కాని నిజంగా వాటిలో అంటరానితనం లేదు. కాకులు ఇళ్లకప్పులమీద వరసగా కూర్చుని చదువుకోవటం చూశారా? దాన్నే కాకిబడి అంటారు. కాకుల్లో ఇంకో మంచి బుద్ధికూడా ఉంది. ఒక కాకికి తినేటందుకేమైనా దొరికితే అన్నికాకులనూ పిలుస్తుంది. అంతేకాని తనపొట్టకు మాత్రమే చూసుకోదు. వీటినిబట్టి కాకులు చాలా గొప్పవని చెప్పవచ్చు.



అటువంటి ప్రసిద్ధిగన్న కాకి వంశంలో పుట్టింది మన కాకమ్మక్క. ఆవిడ గొప్ప సంగీత విద్వాంసురాలు. ఆవిడ గొంతెత్తి కాకధ్వనీ, కాకభైరవీ మొదలైన రాగాలు పాడితే దిక్కులు మారు మోగుతాయి. వినేవాళ్ల చెవులు చిల్లులు పడతాయి.

కాకమ్మక్కయ్య మొగుడు కాకిబావ. చాలా విద్యలు నేర్చినవాడు. పిల్లల నెత్తి కొట్టి చేతిలోఉన్న అప్పచ్చులు కాజెయ్యటంలో నేర్పరి. ఇన్ని గొప్ప గుణాలుచూసే కాకమ్మక్క కాకిబావను వరించింది.

ఒకనాడు పొద్దున్నే కాకిబావయ్య కాకమ్మక్కయ్యతో అన్నాడు గదా:

"ఒసే, కాకామణీ! మనం ఈపూట ఎక్కడికైనా మంచిచోటికి విందుకుపోతే ఎట్లా ఉంటుందే?" అన్నాడు.

బావకు సంతోషంగా ఉన్నప్పుడు అక్కయ్యను కాకామణీ అని పిలుస్తాడు.

"బాగానే ఉంటుంది. ఎవరి ఇంటికి పోదాం?" అని రాగం తీసింది కాకమ్మ. కాకమ్మక్క ఎప్పుడూ మామూలుగా మాట్లాడదు, సంగీతంలోతప్ప.

"దగ్గిరే నాయుడుగారిల్లుంది. పొద్దుటి పూట వారింటో చక్కని ఇడ్డెనలూ, ఉప్మా చేసుకుంటారు. అయితే నాయుడు గారు కుంభకర్ణుడు. బారెడు పొద్దెక్కి గాని లేవడు. ఏం మనుషులో వీళ్ళు! మనలాగా వీళ్లకు తెల్లారుజామునే లేచే అలవాటులేదు. వొట్టి సోమరిపోతులు. మన ఇద్దరమూ నాయుడుగారింటికి పోదాం. నువు కమ్మగా ఆయనకు మేలు కొలుపులు పాడు. అప్పుడాయన లేచి మనకు ఫలహారం పెట్టిస్తాడు," అన్నాడు కాకిబావ.

నాయుడుగారి ఇంటిపక్కనే వేపచెట్టు ఒకటి ఉంది. దానికొమ్మ ఒకటి మేడ మీదికి ఉంది. ఆ కొమ్మమీద కాకి దంపతులు కూర్చున్నారు. ఇద్దరూ గొంతులు కలిపి ముచ్చటగా నాయుడుగారికి మేలుకొలుపు పాడ నారంభించారు.

"కాకా! కాకాక్రా! అక్రా! కిర్ క్రీ! క్రా క్రా"
"కా అఅఅ! కా అఅఅ! క్రా అఅఅ! క్రు క్రీర్!"

కాకిపాటకు ఎంతటివాడైనా నిద్రలేవవలిసిందే. కాకిపాట రుషుల తపస్సు కూడా భగ్నం చెయ్యగలదు. కాని నాయుడుగారు ఎద్దుమొద్దు స్వరూపం. అందుచేత ఆయన కాకిదంపతుల పాట లక్ష్యం చెయ్యకుండా గురకపెట్టి నిద్ర పోతున్నాడు.

అందుచేత మన కాకిదంపతులు స్థాయిహెచ్చించి రాగం మార్చి ఇంకో మాంచిపాట ఆరంభించారు. కాకభైరవి ఆలాపన జోరుగా సాగింది. అంతకంతకూ పంచమస్థాయికి వెళ్లింది. ఎట్లాగయితేనేం నాయుడుగారు లేచాడు. కాని కాకిపాట ఆనందించటానికి బదులు తనచేతికర్ర కాకులమీదికి కోపంగా విసిరివేశాడు. అది కాస్తా వేపకొమ్మల మధ్య చిక్కుకు పోయింది. చేసేదిలేక, నాయుడుగారు నౌకరును ఫలహారం పట్టుకురమ్మని కేకవేసి ముఖం కడుక్కోవ టానికి వెళ్లాడు.

నౌకరు నాయుడుగారి ఫలహారం పట్టుకొచ్చి గదిలోపెట్టి వెళ్లాడు. ఆరు ఇడ్డెనలూ, కమ్మని నెయ్యీ, గారెలూ, బిస్కట్లూ, వెన్నా, అన్నీ పళ్లెంలో ఉన్నాయి.

కాకిబావా కాకమ్మక్కయ్యా చెట్టుమీదనుంచి దిగివచ్చి ఫలహారం ప్రారంభించారు. కాకమ్మక్కయ్య ఒక్క ఇడ్డెనూ, ఒక్క గారే తిన్నది. కాకిబావ మాత్రం దిట్టంగా తిన్నాడు. అయితే ఇద్దరూ వెన్న నంజుకున్నారు. ఇద్దరి ముక్కులకూ వెన్న అంటింది. ఇద్దరూ కాసిని మంచి






నీళ్ళు తాగారు. కాకిబావ నాయుడుగారి తివాసీమీద ముక్కు తుడుచుకున్నాడు. కాకమ్మక్కయ్య పక్కగుడ్డలతో తుడుచుకున్నది.

ముక్కు తుడుచుకుంటూ ఉండగా కాకిబావకు మంచి ఆలోచన కలిగింది. ఫలహారం పళ్లెమంతా తనుపట్టుకుపోతే ఎంతబాగుంటుంది, అని? ఆలోచన బాగానేఉంది కాని పట్టుకుపోవటం ఎట్లా?



ఫలహారం పళ్లెం ముక్కుకు అరపదు. అందుకని కాకిబావ ఫలహారం పళ్లెం కిందఉన్న గుడ్డను ముక్కుతో పట్టుకు లాగాడు. బల్లమీద పళ్లెమూ, గిన్నెలూ, గ్లాసులూ పెద్ద చప్పుడుతో కింద పడ్డాయి.

ఇక గప్‌చిప్. అక్కడ ఏంజరిగిందో కూడా చూడకుండా కాకిబావా, కాకమ్మక్కయ్యా ఊళ్లోకి ఉడాయించారు.






అనగా అనగా ఒక నవాబు. ఆ నవాబుకు ఒక్కడే కొడుకు; ఒక్కతే కూతురు. కొడుకు చాలసాహసి. మిన్ను విరిగి మీదపడ్డా జంకేవాడుకాదు. పేరు ఫిరోజిషా. కూతురు చక్కని చుక్క. పేరు జహనారా.

ఆ నవాబు ప్రతి సంవత్సరం మహా వైభవంగా పీర్లపండగ చేసేవాడు. ఆ ఉత్సవాలు చూడడానికి దేశదేశాలనుంచి రాజకుమారులు, కవులు, గాయకులు, శిల్పులు వచ్చేవాళ్ళు. వచ్చి తమతమ విద్యలనుచూపి నవాబువద్ద బహుమతులు పొందుతుండేవాళ్ళు.

ఒకయేడు ఆ ఉత్సవాలకు ఓ ముసలి శిల్పి వచ్చాడు. ఇతర శిల్పులు ఆడే బొమ్మలు, పాడేబొమ్మలు, ఇంకా రకరకాల ప్రతిమలు తెస్తే, ముసలితాత ఒక కొయ్యబొమ్మ గుర్రాన్ని పట్టుకొచ్చాడు. తాతను చూడగానే తతిమ్మా శిల్పులకు ఎక్కడలేని నవ్వువచ్చింది.

"ఈ గుర్రాన్ని నువ్వే చేశావా తాతయ్యా," అని అడిగాడు ఒక శిల్పి.

"బలేగుర్రం తాతయ్యా, ఎంత కిస్తావు?" అని వెక్కిరించాడు మరొక శిల్పి.

"ఏమి గుర్ర మనుకున్నావేమిరా అది దేవతాగుర్రం," అన్నాడు మరొక శిల్పి.

"వాళ్లతో నీకెందుకుకాని దీన్ని ఎంతకిస్తావో నిజంగాచెప్పు తాతయ్యా," అన్నాడు నవ్వకుండా మరొక శిల్పి.

తాతకు కోపం వచ్చింది. "మీరు కొనలేరు, మీ అబ్బలు కొనలేరు. ఎందుకు

వచ్చినబాధ? పొండి, పొండి,'' అని కసిరాడు.

నవాబు శిల్పులు తెచ్చిన బొమ్మలు చూచి మంచివాటిని పుచ్చుకొని ఆయా శిల్పులకు తగిన బహుమానమిచ్చాడు. చివరికి ముసలితాత కొయ్యగుర్రం మిగిలింది. ''ఏమిటి దీని విశేషం,'' అని అడిగాడు నవాబు.

''ఏలినవారు చిత్తగిస్తే మనవి చేస్తాను. ఇది వట్టి చూపులగుర్రంకాదు. కీలుగుర్రం. ఇది కనుమూసి కనుతెరిచే లోపల చుక్కల్ని చూసివస్తుంది ఆకాశం అంతు కనుక్కొస్తుంది,'' అన్నాడు ముదివగ్గు.

''టట్ టట్! అంతా అబద్ధం. అలాంటిది భూలోకంలో ఉండదు,'' అన్నాడు నవాబు.

''ఏలినవారు అనుగ్రహిస్తే ఇప్పుడే చూపిస్తాను,'' అన్నాడు శిల్పి.

''ఇక్కడికి పదికోసుల దూరంలో చందనపర్వతం ఉంది. దానిమీద మసీదు. మసీదుకు పక్కన ఖర్జూరపుచెట్టు ఉంది. పోయి ఆ చెట్టు ఆకు పట్టుకురా చూస్తాను,'' అన్నాడు నవాబు.

ముసలిశిల్పి నవాబు అనుమతి పుచ్చుకొని గుర్రమెక్కి ఏదో బుడుపు లాగావున్న మీట నొక్కాడు. గుర్రం ఆగమేగాలమీద లేచింది. అది ఎప్పుడు వెళ్లి ఎప్పుడు వచ్చిందో ఎవరికీ తెలీదు. నవాబు తెప్పరిల్లి చూచేసరికి ఖర్జూరపు ఆకు పుచ్చుకొని శిల్పి ఎదురుగా నుంచున్నాడు.

నవాబుకు ఎలాగైనా ఆ గుర్రాన్ని సంపాయించా లనిపించింది. ''నీకేమి కావాలన్నా కోరి పుచ్చుకో. నాకా కీలు గుర్రం మాత్రం యివ్వు,'' అన్నాడు.



"అయితే మీ కుమార్తెను నాకిచ్చి పెళ్ళిచెయ్యండి," అన్నాడు శిల్పి. అంతా తెల్లబోయారు. శిల్పి మూడుకాళ్ల ముసలి. అందులో పగలుచూస్తే రాత్రి కల్లోకి వస్తాడు. అలాంటివాడికి చూస్తూచూస్తూ, చక్కనిచుక్క, పదహారేళ్ల బాలను ఎలా ఇవ్వటం? నవాబు ఆలోచించ సాగాడు.

నవాబుకొడుకు ఫిరోజిషా అన్నాడు:—"నీవు గారడీచేశావో లేక, ఆ గుర్రానికే ఆ శక్తివుందో తెలీదు. అసలు ఇతరులు ఎక్కితే పోదేమో. నిజం తెల్సుకోకుండా ఎలాతీసుకోవటం? నేను పరీక్షిస్తా." అని,

ఫిరోజిషా ఎకాయెకివెళ్ళి కీలుగుర్రమెక్కి మీటనొక్కాడు. అది రివ్వున లేచి, చూస్తుండగానే మబ్బులోకి మాయమైంది. నవాబు, అతని బలగం తెల్లబోయి చూస్తున్నారు. ఇంత సాహసం జరుగుతుందని ఎవరూ అనుకోలేరు. ఫిరోజిషా తిరిగి వస్తాడని ఎదురుచూస్తూ కూచున్నారు. మధ్యాహ్నమైంది. ఆ చూకిలేదు. సాయంత్రమైంది, అయిపులేదు, ప్రొద్దుగూకింది. ఆనవాలు లేదు. నవాబుకు పట్టరాని కోపం వచ్చింది. శిల్పి ఆ గుర్రాన్ని తేకపోతే తనకొడుకు యిలా అయ్యేవాడు కాదుగా. "వీణ్ణి తీసికెళ్ళి జైలులో పడెయ్యండి, తరువాత చూదాము," అన్నాడు. నవాబు శిల్పిని తీసికెళ్ళి భటులు జైల్లో తోశారు.

ఇక ఫిరోజిషా ఆ కీలుగుర్రంమీద వాయువేగంతో పైకిలేచాడు. ఆ వేగానికి అతనికి భయం కలిగింది. తాను ఎంత ఎత్తున ఉన్నానోనని క్రిందికి చూచాడు. మనుషులు కనిపించలా. చెట్లు కనిపించలా. తనకోట కనిపించలా. చందనగిరి






ఇలా కొంతసేపు పోగాపోగా ఫిరోజిషాకు జడుపు తగ్గింది. గుర్రాన్ని క్రిందికిదించటం ఎలాగా అని ఆలోచించాడు. ఎక్కడో దానికి మరొకమీట ఉండితీరాలనుకొన్నాడు. జూలులో వెదికాడు; కనిపించలా. జీనుప్రక్కన ఉన్న చీలలు తిప్పి చూచాడు; లాభం లేకపోయింది. చివరికి విసుగెత్తి దాని రెండు చెవులు పట్టుకొన్నాడు. గుర్రం వేగం తగ్గి మెల్లగా క్రిందికి దిగసాగింది. అప్పటికి అతని ప్రాణాలు కుదటపడ్డాయి.

గుర్రపుచెవులు రెండు ఇంకా గట్టిగా వెనకకులాగాడు. చర్రున అది కిందికి దిగసాగింది. అలా దిగిదిగి చివరికి ఒక ఏడు అంతస్థుల మేడమీద వాలింది. అప్పటికి బాగా ప్రొద్దుపోయింది. పట్టణమంతా మాటుమణిగివుంది.

పిరోజిషా మెట్లు దిగి ఏడో అంతస్థు లోపలికి వెళ్ళాడు. అతనికి సంగీతం వినిపించింది.

మాత్రం చిన్నిపుట్టలాగా కనిపించింది. దానితో అతనికళ్ళు తిరిగాయి. గుర్రం జూలు గటిగా పట్టుకొన్నాడు. అది ఆక్కుండా పైకిపోతూవుండి.

ఫిరోజిషాకు పెద్దలు తలుపుకొచ్చారు. అల్లారుముద్దుగా పెంచిన తండ్రి జ్ఞాపకం వచ్చాడు. రోజూ తనతో ఆడుతూ పాడుతూ వుండే చెల్లెలు జ్ఞాపకం వచ్చింది. స్నేహితులు జ్ఞాపకం వచ్చారు. అతనికి భయం మరీ ఎక్కువైంది. కళ్ళు మరీ గట్టిగా మూసుకొన్నాడు. గుర్రం వాయువేగ మనోవేగంతో పోతూనే వుంది.

ఆ శబ్దాన్నిబట్టి వెళ్లాడు. మరకత మాణిక్యాలతో ధగధగ మెరుస్తూ వుంది, ఒక పెద్దగది. లోపలి కెళ్లాడు. అక్కడ ఒక హంసతూలికా తల్పంమీద రాజకుమార్తె పండుకొని ఉన్నది. ఆమె చుట్టూ చెలికత్తెలు పండుకొని నిద్రపో తున్నారు. ఫిరోజిషా తనకళ్ళను తాను నమ్మలేకపోయాడు. కలగంటున్నానేమో ననుకొన్నాడు. తనవొళ్లు తాను గిచ్చు కొన్నాడు. బాధ తెలుస్తూనే వుంది. అప్పుడదంతా నిజమని అనుకున్నాడు.

మళ్ళీ ఒకసారి రాజకుమార్తె వంక చూచాడు. చుక్కలమధ్య చంద్రుడిలాగా వుంది. బంగారపుజుట్టు, తళతళా మెరు స్తూవుంది. మెల్లగా వెళ్ళి ఆ జుట్టు మెల్లగా తాకాడు. రాజపుత్రి కళ్ళువిప్పి అతన్ని చూచింది.

ఫిరోజిషా ఆమెను ప్రక్కకు తీసుకెళ్లి తన కథంతా చెప్పాడు. తనతో పర్షియాకువచ్చి తన్ను పెండ్లాడ వలసిందని ప్రార్థించాడు. వంగరాజపుత్రి కూడా అతన్ని ప్రేమించింది. రెండోవారికి చెప్ప కుండా అతనివెంట బయలుదేరింది. ఇద్దరూ కీలుగుర్రమెక్కి పర్షియాలో తమ పట్టణముందు వాలారు.

మేళతాళాలు, బాజాభజంత్రీలు లేకుండా కొత్తపెండ్లికూతురును అంతః పురానికి తీసుకొనివెళ్ళటానికి ఫిరోజిషా మనస్సు ఒప్పలేదు. రాజపుత్రికకు ఇప్పుడేవస్తాననిచెప్పి ఆమెను,గుర్రాన్ని అక్కడి తోటలోని బంగళాలో దింపి ఒక్కడే ఇంటికి వచ్చాడు.

నవాబు సంతోషానికి మేరలేక పోయింది. వెంటనే శిల్పిని విడుదల చేయించాడు. రాజపుత్రిని తీసుకురావటా నికి ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. ఈసంగతంతా శిల్పి విన్నాడు. గుప్పుడు చప్పుడుకాకుండా రాజకుమారి దగ్గరకు వెళ్ళి, "మిమ్ము ఈ గుర్రంమీద అంతః పురానికి తీసికొనిరమ్మన్నారు," అన్నాడు. ఆమె నమ్మి కీలుగుర్రమెక్కి అతని






వెనుక కూర్చుంది. శిల్పి మీట నొక్కాడు. గుఱ్ఱం రివ్వున లేచి పోయింది.

మేళతాళాలతో రాజపుత్రికి ఎదురుకోలు ఇవ్వడానికి వచ్చిన పరివారం జరిగినమోసం తెలుసుకొన్నది. ఈవార్త విని ఫిరోజిషా దిగాలుపడ్డాడు. రాజపుత్రి లేక, తానుబ్రతకడం కల్ల అనుకొన్నాడు. ఎలాగైనా ఆమెను తిరిగి తీసుకురావాలని కాలి నడకను బయలుదేరాడు.

శిల్పి ఎక్కినగుఱ్ఱం పోయిపోయి గ్రీసు దేశంలో ఒక మైదానంమీద దిగింది. రాజకుమారి శిల్పిచేసిన మోసం తెలుసుకొని ఏడువసాగింది. ఆ ఏడుపు వేటకువచ్చిన గ్రీసురాజు చెవులబడ్డది. అతడు చప్పునవచ్చి జరిగిన మోసం రాజపుత్రివల్ల విని శిల్పితల నరికివేశాడు.

గ్రీసురాజుకుకూడా వంగరాజ పుత్రిమీద ప్రేమ ఏర్పడింది. ఇది ఏమాత్రం ఆమెకు ఇష్టంలేదు. రాజు బలాత్కారంనుంచి తప్పుకోటానికి పిచ్చిఎత్తినట్లు నటించసాగింది. దగ్గరకు వచ్చేవాళ్ళను రక్కేది, పీకేది. రాజు ఎంతో చిన్నపోయాడు. ఆమెపిచ్చి కుదర్చటానికి ఎందరో వైద్యుల్ని పిలిపించాడు. ఎన్నో మందు లిప్పించాడు. లాభంలేకపోయింది. నిజమైన పిచ్చి అయితేగా అసలు కుదరటానికి?

ఇక్కడ యిలా జరుగుతూవుండగా అక్కడ పర్షియాలో కాలినడకను బయలుదేరిన ఫిరోజిషా ఊళ్ళుదాటాడు, ఉకాలు దాటాడు. చీమలు దూరని చిట్టడవీ, కాకులు దూరని కారడవీ దాటాడు. ఎక్కడా తన రాజపుత్రిజాడ తెలియలేదు. ఏరులు



దాటాడు, నదులుదాటాడు, గుట్టలెక్కాడు, మిట్టలెక్కాడు. చివరికి గ్రీసురాజు పట్టణం చేరుకొన్నాడు. అక్కడ రాజపుత్రి సంగతి విన్నాడు.

ఫిరోజిషా వైద్యుని వేషంతో రాజు దగ్గరకు వెళ్లి "నాకు భూత వైద్యం తెలుసు. రాజపుత్రి పిచ్చి కుదురుస్తా" నన్నాడు. రాజు సంతోషించి అతన్ని అంతఃపురానికి తీసుకువెళ్లాడు. కొత్త వైద్యుణి చూడగానే రాజకుమారికి పిచ్చి కొంచెం తగ్గిపోయింది.

"రాజా, ఈ అమ్మాయికి ఒక కీలు గుర్రంమూలాన ఈ వ్యాధి కలిగింది ఈమెను ఆగుర్రంమీద ఎక్కించి చుట్టూ గుగ్గిల ధూపం వెయ్యాలి. మంత్రాలు చదవాలి. అప్పుడుగాని ఈవ్యాధి పూర్తిగ పోదు. పదియేళ్ళ గడువి స్తే కీలుగుర్రం చేస్తాను," అన్నాడు ఫిరోజిషా.

"ఈ భాగ్యానికి పది సంవత్సరా లెందుకు. మనదగ్గర ఒక కీలుగుర్రం ఉన్నది. దానితో చికిత్స చెయ్యి," అన్నాడు రాజు.

ఫిరోజిషా పాచిక పారింది. రాజకుమారిని కీలుగుర్రం ఎక్కించి చుట్టూ దట్టంగా గుగ్గిలం ధూపం వేయించాడు. ఆ పొగతెరలో తానుకూడా కీలుగుర్రంపై ఎక్కాడు. మీట నొక్కాడు. వాయువేగంతో కీలుగుర్రం ఆకాశంలోకి ఎగిరిపోయింది.

ఫిరోజిషా బెంగాలు రాకుమారితో క్షేమంగా ఇంటికివచ్చిచేరాడు. వారిద్దరికీ వైభవంగా పెండ్లి జరిగింది. పెండ్లినాటి రాత్రి బెంగాలురాకుమారి కీలుగుర్రాన్ని తగలబెట్టించింది. దానితో వాళ్ళకష్టాలు తీరిపోయాయి. హాయిగా రాజ్యం ఏలుకుంటూ నూరేళ్ళు బ్రతికారు.



# పొట్టి పిచిక కథ

అనగా అనగా ఓ వూర్లో వక పొట్టి పిచిక వుండేది. అదేం చేసిందీ, ఊరల్లా తిరిగి ఉలవగింజ, చేనల్లా తిరిగి సెనగ్గింజ, పెరడల్లా తిరిగి పెసరగింజ, ఇల్లాంటివి ఎన్నోగింజలు పోగు చేసుకొని కొట్టి కొట్టి కొండంత రొట్టిచేసుకుంది. చేసుకుని, చింత చెట్టుమీద కూర్చుని, ఆ పిచిక ఆ రొట్టెను ఎగరేసుకుంటూ, ఎగరేసుకుంటూ, తింటూ ఉంటే, చీమతలకాయంత ముక్క చెట్టుతొర్రలో పడి పోయింది.

అప్పుడా పిచిక ఏం చేసిందీ వడ్రంగి దగ్గరకి వెళ్లి, "వడ్రంగీ, వడ్రంగీ, అతి కష్టపడి కొండంత రొట్టెచేసుకుని తింటూంటే చీమ తలకాయంతముక్క చెట్టు తొర్రలో పడిపోయిందోయ్! చెట్టుకొట్టి అది తీసి పెట్టాలోయ్," అంది.

వడ్రంగి 'చీమ తలకాయంత ముక్కకై చెట్టు కొట్టాలా?' అని పక పక నవ్వాడు.

అప్పుడాపిచిక కెంతో కోపంవచ్చి తిన్నగా రాజు



దగ్గిరకివెళ్లి, "రాజుగార్లూ, రాజుగారూ! అతి కష్టపడి కొండంత రొట్టి చేసుకొని తింటూంటే చీమ తలకాయంతముక్క చెట్టుతొర్రలో పడి పోయింది. తీసిపెట్టమని వడ్రంగి నడిగితే తీయనన్నాడు. వడ్రంగిని దండించు రాజా," అంది.

రాజుకూడా నవ్వి, 'ఇంత చిన్నపనికి వడ్రంగిని దండించాలా? దండించను పో' అన్నాడు రాజు.

'అమ్మా వీడిపని ఇలా వుందా!' అని ఆ పిచిక వెంటనే లేళ్లదగ్గిరకి వెళ్లి జరిగిందిచెప్పి, "చెట్టు కొట్ట

అవసరాల రామకృష్ణారావు. తుని.



మంటే వడ్రంగి కొట్ట నన్నాడు. వడ్రంగిని దండిం చమంటే రాజు దండించ లేదు. రాజుకు ఉద్యానవన మంటే ఎంతో ఇష్టం. అది పాడుచెయ్యండి లేళ్లూ!" అంది.

"ఈ చీమతలకాయంత రొట్టిముక్కకి చక్కటి రాజు పూలతోట పాడు చేస్తామా? చాలు, చాలు పో," అన్నాయి లేళ్లు.

"అమ్మ! వీటమ్మ కడుపు కాలా! ఈ వెధవ లేళ్ళకు ఇంత తెగులా!" అని ఆ పిచ్చిక ఏంచేసిందీ, బోయ వాడి దగ్గిరికివెళ్లి,

'బోయాడూ! బోయాడూ! చీమ తలకాయంత రొట్టిముక్క చెట్టుతొర్రలో పడిపోయింది. తియ్యమంటే వడ్రంగి తీశాడు కాడు. వడ్రంగిని దండించమంటే రాజలా చెయ్యలేదు. రాజు పూలతోట పాడుచెయ్య మంటే లేళ్లు పాడుచెయ్య లేదు, లేళ్ల కాళ్లు విరక్కొట్టు బోయాడూ!" అంది.

ఇదంతా విని బోయ వాడు, 'ఈపాటి భాగ్యానికి చెంగు చెంగని గెంతే లేళ్ల కాళ్లను విరక్కొట్టనా? బాగానేవుంది. వెళ్లు వెళ్లు,' అని పంపేశాడు.

దాంతో పిచిక్కి కోప మెక్కువై ఎలక దగ్గరకు వెళ్లి, 'ఓయ్, ఎలకా! ఎలకా! ఓ సహాయం చేసిపెట్టాలి- చీమ తలకాయంత రొట్టి ముక్క చింతచెట్టుతొర్రలో పడిపోతే తియ్యమంటే వడ్రంగి తీశాడు కాడు. వాడ్ని దండించమంటే రాజలా చేశేడుకాదు. రాజు గారి పూలతోటను పాడు చెయ్యమంటే లేళ్లలా చేశా యికాదు. లేళ్లకాళ్లు విర క్కొట్టమంటే బోయ విర క్కొట్టేడు కాదు. బోయ చెప్పులు కొరికి పాడుచెయ్యి ఎలకా!" అంది.

ఎలికెకూడా "నావల్ల కాదు పొ" మ్మని అంది.

"అమ్మ దొంగముండా, నీకెంత గర్వమే! అని పిల్లి దగ్గిరకి వెళ్ళి, "పిల్లిబావా! పిల్లిబావా! చీమతలకాయంత



రొట్టిముక్క చెట్టుతొర్రలో పడిపోతే తియ్యమంటే వడ్రంగితీసేడుకాడు. వడ్రంగిని దండించమంటే రాజలా చెయ్యలేదు. రాజు పూలతోట చెరుపమంటే లేళ్లలా చెయ్యలేదు. లేళ్ల కాళ్ళు విరొక్కొట్టమంటే బోయ విరక్కొట్టాడు కాదు. బోయ చెప్పులు కొరకమంటే ఎలక కొరికిందికాదు. ఎలుకను వేటాడు పిల్లీ!" అంది.

"నాకిప్పుడు చాలా పనులున్నాయ్, ఇదే పనా ఏమిటి?" అని పిల్లి వెళ్ళిపోయింది.

'అయ్యో దీని దర్జా



మండా! ఉండు దీని పని పట్తాను,' అని తిన్నగా అవ్వ దగ్గిరకెళ్లి, 'అవ్వా, అవ్వా, చీమ తలకాయంత రొట్టి ముక్క చెట్టుతొర్రలో పడితే వడ్రంగి తీసేడుకాదు. రాజు వడ్రంగిని దండించాడు కాదు, రాజుగారి పూలతోటను లేళ్లు పాడుచెయ్యలేదు. లేళ్ల కాళ్లు బోయ విరక్కొట్ట లేదు. ఎలక బోయ చెప్పులు కొరకలేదు. పిల్లి ఎలకను వేటాడలేదు. పిల్లిమీద వేడి వేడి పాలొయ్యి అవ్వా," అంది.

'చీమతలకాయంత రొట్టిముక్కకోసం పిల్లిమీద పాలోస్తానూ? చాలుచాల్లే,' అని అవ్వ కసిరి పొమ్మంది.

"ఏమి తూలిపోతున్నావే! మామ్మా!" అని తిన్నగా తాతయ్య దగ్గిరకి వెళ్ళి, "చీమతలకాయంత రొట్టి ముక్క తొర్రలో పడిపోతే, వడ్రంగి తియ్యనన్నాడు. రాజు వడ్రంగిని దండించాడు కాదు. లేళ్లు రాజుగారి పూలతోట పాడుచేశాయి కాదు. లేళ్లకాళ్ళు బోయ విరక్కొట్టలేదు. బోయ చెప్పులు ఎలక పీకలేదు. అవ్వ పిల్లి మీద వేడి పాలొయ్యలేదు. అవ్వను చితక్కొట్టు తాతా!" అంది.

'అమ్మో, నేనలాచేస్తానా! చెయ్యను పో,' అన్నాడు తాత.

"ఓహో! నీకింత గర్వమా, సరే!" అని ఆపిచికేం చేసిందీ, గబగబా అవుదగ్గిర కెళ్ళి, "ఆవు పిన్నీ, ఆవు పిన్నీ! చీమ తలకాయంత ముక్క చెట్టు తొర్రలో పడి పోతే వడ్రంగి తీసేడుకాడు. రాజు వడ్రంగిని దండించ లేదు. రాజు పూలతోట లేళ్ల పాడుచెయ్యలేదు. లేళ్ల కాళ్ల బోయవాడు విరక్కొట్టలేదు. బోయ చెప్పలు ఎలక కొరకలేదు. ఎలకను పిల్లి వేటాడలేదు. పిల్లి మీద అవ్వ వేడిపాలొయ్యలేదు. తాత అవ్వను చితక్కొట్టలేదు. తాత, పాలుతియ్యడాని కొచ్చినపుడు 'ఫెడీ' మని తన్ను ఆవూ," అంది.

'అబ్బే, నేనలాచెయ్యను సుమా!' అంది ఆవు.

అప్పుడు పిచిక విచారిస్తూ, "పొద్దున్నే లేచిఎవరిమొహం చూశానో, ఎవళ్ళ నడిగినా ఏమీ చెయ్యనంటున్నారు ఎలాగో!" అని ఏడుస్తూ కూర్చుంది. ఇంతట్లో ఓ ఈగ ఆ దారమ్మట వెడుతూ "ఏం పిచికా ఏడుస్తున్నా" వంటే, పిచిక జరిగినదంతా చెప్పి ఉపకారము చేసిపెట్ట మంది.

అప్పుడు ఈగ ఏం చేసిందీ, వెంటనేవెళ్లి అవు చెవులో దూరి నానా అల్లరి చేసింది. ఆవు ఆ బాధ భరించలేక తాతని తన్నింది.



తాతకి కోపంవచ్చి అవ్వని చితకకొట్టాడు. అవ్వకు వళ్లమండి పిల్లిమీద వేడి పాలోసింది. పిల్లి కోపం కొందీ ఎలక వెంటపడింది. ఎలక భరించలేక బోయ చెప్పులు కొరికింది. బోయ ఆ కోపం తీర్చుకోడానికి లేళ్ల కాళ్లను విరగకొట్టేడు. లేళ్ళు కోపంచేత రాజుగారి తోటను పాడుచేశాయి. రాజుకి బుద్ధివచ్చి వడ్రంగిని శిక్షించేడు. వడ్రంగి చచ్చి నట్టు చెట్టును నరికి, తొర్ర తవ్వి ఆ చీమ తలకాయంత రొట్టెముక్కనూ, తీసి పిచిక చేతిలో పెట్టేడు.

పిచిక మళ్లీ ఎగవేసు కుంటూ ఎగవేసుకుంటు ఆ రొట్టెముక్కను కమ్మగా తిన్నది.




మనం మూడుసార్లు మహాసామ్రాజ్యం స్థాపించాము. మొదటిది ఆంధ్ర సామ్రాజ్యం, రెండోది కాకతీయ సామ్రాజ్యం, మూడోది విజయనగర సామ్రాజ్యం. ఈ మూడుసామ్రాజ్యాలు దక్షిణదేశానికి చేసినసేవ అంతా యింతాకాదు. వీటిని నెలకొల్పకుండా ఉన్నట్లయితే దక్షిణదేశచరిత్ర మరొక విధంగా ఉండేది.

ఈ సామ్రాజ్యాలను సమర్థతతో పరిపాలించినవారిలో స్త్రీలుకూడా ఉన్నారు. వారిలో రుద్రమ్మ ముఖ్యురాలు.

కాకతి గణపతిదేవ మహారాజుకు ఆడపిల్ల అయినా మగపిల్లవాడైనా రుద్రమ్మ ఒక్కతే. తండ్రి తరువాత రాజ్యం చేయవలసింది ఆమే. అందువల్ల గణపతిదేవుడు రాజుకు కావలసిన విద్యలన్నీ రుద్రమ్మకు చెప్పించసాగాడు. రుద్రమ్మ కత్తిసాము నేర్చింది. గుఱ్ఱపుస్వారి నేర్చింది. సేనలను నడప నేర్చింది. కోటలుపట్ట నేర్చింది. ఇంకా మంచిరాజుకు ఎన్ని విద్యలు కావాలో అన్నివిద్యలు నేర్చుకొంటూవుంది.

ఇదిమాత్రం తల్లి నారమ్మకు నచ్చలేదు. అప్పుడప్పుడు నారమ్మ భర్త గణపతిదేవునితో అంటూవుండేది:— "ఆడపిల్లకు కత్తిసాములేమిటి, ఏ సంగీతమో, ఏ చిత్రకళో నేర్పించక. ఆడపిల్ల అన్నతరువాత ఆడపిల్లేకాని మగపిల్లవాడు అవుతుందా? ఇవ్వాళ కాకపోతే రేపైనా ఒకయ్యచేతిలో పెట్టవలసిందేగా!" గణపతిదేవుడు అతీపతీ చెప్పేవాడుకాదు. నవ్వి వూరుకానేవాడు.

రుద్రమ్మ సాముగరిడీలు నేర్చుకోవటం ఆమె చెలికత్తెలకుకూడా

విడ్డూరంగా వుండేది. లోలోన కొంత అసూయ పడేవారుకూడా. ఎలాగైనా ఆమె మనస్సు చిన్నపుచ్చి మాన్పించా లనుకొన్నారు. ఏమిచేస్తే బాగుంటుందా అని గుసగుసలు పోయారు. అదికాద న్నారు, ఇదికాదన్నారు; చివరికి ఎలా గైతేనేం ఒక నిర్ణయానికి వచ్చారు.

ఆనాడు రుద్రమ్మ ఉద్యానవనంలో ఒంటరిగా కూర్చునివుంది. అప్పుడే ఒక్కొక్క చెలికత్తెవచ్చి, "జయము జయము యువరాజా!" అంటూ ప్రక్కన నిలబడింది. రుద్రమ్మ తొణకలేదు, బెణకలేదు. ఠీవిగా తలఆడిస్తూ అలాగే కూర్చున్నది. చెలికత్తెలు వెలవెలపోయి బొమ్మలులాగా నిలబడ్డారు. ఉలికేవాళ్లను ఉలికించవచ్చుకాని ఉలకనివాళ్ల ను ఏమి చేస్తారు?

రుద్రమ్మ వాళ్లను తానే పలకరించింది. —"యువరాజుతో మీరు చెప్పుకోగల మనవి ఏమిటి," అని అడిగింది. చెలికత్తెలు సిగ్గు నమిలారు. "మీకువచ్చిన పరవా ఏమీలేదు. మీరు ఏమికోరినా యిచ్చివేస్తాను," అంది రుద్రమ్మ. చెలికత్తెలు ఒకరిముఖం ఒకరు చూచు కొన్నారు. అది అడిగితే బాగుండును, ఇది అడిగితే బాగుండునని ఒకరికొకరు సైగ చేసుకొన్నారు. చివరికి పెద్ద చెలికత్తె చేతులు జోడించి, "మీరు ఆయుధాలు ఇక ఎన్నడూ ముట్టకపోతే చాలు. అంతకన్నా మాకు కావలసిం దేముంది?" అన్నది.

రుద్రమ్మ మనస్సు కటకటపడ్డది. ఇంతకాలం నేర్చుకొన్న సాముగరిడీలు ఏమికాను? ఆయుధం ముట్టకపోతే తన తండ్రి మనస్సు ఎలా వుంటుంది? మాట తప్పితే చెలికత్తెలకు తనమీద గౌరవం ఏమి ఉంటుంది? ఆమె ఆలో చించి, ఆలోచించి చివరికి అన్నది, "సరే అలాగే, కాని నన్ను ముందు సాముగరిడీలలో ఓడించాలి. ఆపని ఎవరుచేసినా మళ్లీ ఆయుధం పట్టను."

చెలికత్తెలకు ఎక్కడలేని సంతోషం వచ్చింది. సరేనంటే సరేనన్నారు. ఈ సంగతి రాణి నారమ్మకు చెప్పారు. ఆమెకూడా మురిసిపోయింది. కూతురు




చేత సాము గరిడీలు మాన్పించవచ్చునను కొంది. వెంటనే మంత్రిని పిలిపించి సంగతిచెప్పించి, కత్తిసాములో ఆరితేరిన రాజకుమారుణ్ణి పిలిపించమన్నది. మంత్రి నవ్వాడు. రాణి ఆశ్చర్యపడి, ''నిన్నకాక మొన్న నేర్చుకొన్న ఆడపిల్లను ఓడించలేరా? నేను నమ్మను. ఆమాత్రపువీరులు ఉండకపోరు. మహారాజుగారివల్ల మాటవస్తుందని భయపడకండి. వారికి నేను చెబుతాను,'' అన్నది.

మంత్రి వినయంగా చెప్పాడు:—"కాకతీయవంశచరిత్ర మీకు సరిగా తెలియదు. తాతముత్తాతలనాటి నుంచి నేను ఎరుగుదును. కత్తిసాములో ఈ వంశం అందెవేసినచేయి. ఈ వంశంలో పుట్టింది రుద్రమ్మ. ఐనా నేను మెప్పుకు అంటున్నానని మీకు సందేహం కలుగుతుంది. మన సేనానికొడుకు సంగతి మీరు వినేవుంటారు. కత్తిసాములో అతన్ని మించినవాళ్లు ఈ రాజ్యంలో లేరు. రేపే పిలిపించి పోటీ జరుపుదాము. మీకే నిజం తెలుస్తుంది." అన్నాడు.

మరునాడు రుద్రమ్మకూ, సేనాని కొడుకుకూ మంత్రి రాణిసమక్షాన కత్తి

సాములో పోటీ పెట్టించాడు. రుద్రమ్మ అనాయాసంగా సేనాని కొడుకును ఓడించి వేసింది. నారమ్మ తనకళ్లను తాను నమ్మలేకపోయింది. ఆపోటీ చూచి నప్పటినుంచి కూతురుచేత సాముగరిడీలు మానిపించాలన్న పట్టుదల మరీ ఎక్కువైపోయింది. భర్త గణపతిదేవునితో పోరుకాడి ఎలాగైతేనేం ఆయనను ఒప్పించింది. వెంటనే రాజ్యమంతటా "రుద్రమ్మను ఓడించినవారికి ప్రధాన సేనానిపదవి యిస్తాము," అని చాటింపు చేశారు.

మేము ఓడించగలమంటే మేము ఓడించగలమని కొమ్ములు తిరిగిన యోధులు, రాజకుమారులు వచ్చారు. కాని రుద్రమ్మను ఓడించినవారు లేక పోయారు. ఇక రుద్రమ్మకు ఆయుధం విడిచిపెట్టవలసినపని లేకపోయింది.

ఈ రుద్రమదేవే గణపతిదేవుని తరువాత చాలకాలం అంగరంగ వైభోగంగా కాకతీయరాజ్యం ఏలింది. ఈమె మనుమడే ప్రతాపరుద్రదేవుడు. ఈమె పరిపాలనలో జరిగిన విశేషాలు చాలా ఉన్నాయి. మళ్ళీ ఇంకోమాటు మీకు చెప్పుతాను.

## మీకు తెలుసునా?



ఏనిగపిల్ల ఎట్లా పాలు తాగుతుంది?



జంతువుల్లో త్వరగా పరిగెత్తే జంతు వేది? గంటకు ఎన్నిమైళ్ళు పరుగెత్తుతుంది.

★

మీకు తెలిస్తే వ్రాయండి: లేకపోతే వచ్చే సంచికలో జవాబుకు చూడండి.

## ఆడపిల్లల పాటలు

పెదచెరువు గట్టునా
భేరి వాగింది,
పెళ్ళివారొచ్చారు
పెదవీధిలోకి!
పసుపు కుంకాలన్ని
పళ్ళాలబట్టి,
రండి పేరంటాళ్లు,
రండెదురు కుందాం!
పానకపు కావిళ్లు
బుజాన్ని పెట్టి,
రావయ్య బ్రాహ్మడా,
రావయ్య త్వరగ!
పెళ్లమ్మ మా యింట్లొ!
పెళ్లి మా యింట్లొ!
పేరైన సీతమ్మ
పెళ్లి మా యింట్లొ!
పెళ్లి పెళ్లనగానె పెరిగెబుగ్గల్లు!
పెళ్లైన మర్నాడు తీసెబుగ్గల్లు!

సంపాదన

వింజమూరి వెంకటరత్నమ్మ

## ఒకటి, రెండు, మూడు

సంపత్

౧

ఒకటి ఒకటి రెండు
అవ్వ బోడి గుండు
దూది నిమ్మ పండు
గాజు గోలి గుండు
ఒకటి ఒకటి రెండు.

౨

రెండు రెండు నాల్గు
పంతులమ్మ నీల్గు
బిచ్చగాని మూల్గు
తేనెవంటి తెల్గు
రెండు రెండు నాల్గు.

౩

మూడు మూడు ఆరు
కంది పప్పు చారు
పేరు లేని ఊరు
అత్తగారి పోరు
మూడు మూడు ఆరు.



మహా పురుషుల

జీవిత చరిత్ర

# గాంధీ తాత

ప్రతి యింట్లో ఒక తాతయ్య ఉండవచ్చు. కాని ఒక దేశం లోనివారందరికీ కలిపి ఒకే ఒక తాతయ్య ఉండటం చాల కష్టం. అలాంటి తాతయ్యలు ఏ వెయ్యేళ్ళకో ఒకసారి దొరుకుతుంటారు. ఇవాళ మన భారతీయు లందరికీ ఒక తాతయ్య ఉన్నాడు. ఆయన ఎవరో మీకు తెలుసు కదూ? ఆయనే గాంధీతాత! మనం చెప్పుకోవాలంటే ఆయన కథలు చాలా ఉన్నాయి.

మన తాతయ్య తండ్రిగారు కరంచంద్ గాంధి; తల్లిగారు పుత్తలిబాయి. ఆయన 1869 అక్టోబరు 2 తేదీన పోర్‌బందర్ అనే గ్రామంలో పుట్టాడు. ఈ గ్రామాన్ని సుధామపురం అని కూడాఅంటారు. మన తాతయ్యకు బాల్యం పోర్‌బందరులోనే గడిచింది. ఆ ఊరిబళ్లో మూడో



క్లాసు వరకు చదివాడేమో. గాంధితాత తన కథ రాసుకుంటూ ఇలా అన్నాడు: "ఆ రోజుల్లో చదువుమాట ఎలాఉన్నా మాస్టార్‌ని తిట్టటం మాత్రం నేర్చు కొన్నాను. నేను వట్టి మొద్దబ్బాయిని. ఒక్క అక్షరముక్క నాకు అంటేది కాదు. ఇప్పుడు చెప్పింది ఇంకా కాసేపటికి మరచిపోయేవాణ్ణి".

అంటే గాంధితాత చిన్నతనంలో మనలాగానే మామూలు కుర్రవాడన్న మాట.

మన తాతయ్య ఏడేళ్ళవాడై ఉండగా వాళ్ళనాయన రాజకోట సంస్థానంలో ఉద్యోగిగా ప్రవేశించాడు. మన తాతయ్య కూడా తండ్రి వెంటవెళ్ళి అక్కడ బళ్లోనే కొంతకాలం చదివి హైస్కూలులో చేరాడు. మనతాతయ్య అక్కడ చదువు తుండగా ఒకసారి భలేగమ్మత్తు జరిగింది. ఇన్‌స్పెక్టరు తనిఖీకి వచ్చాడు. పిల్లలకు డిక్టేషను వ్రాయమని ఐదు గొట్టుమాటలు ఇంగ్లీషులో చెప్పాడు. మనతాతయ్య "హరిశ్చంద్రుడు" లాంటి కష్టమైన ఒక ఇంగ్లీషుమాట తప్పువ్రాశాడు. మాస్టరు అదిచూచి 'ప్రక్క పిల్లవాడి పలకలోచూచి తప్పు దిద్దుకో' మని తాతయ్యకు సైగ చేశాడు. నువ్వూ నేనూ ఐతే అలాంటి మాస్టరుదొరికినందుకు ఎంతసంతోషించే వాళ్ళం? కాని మనతాతయ్యకు మొదటి నించీ, అబద్ధ మాడకూడదనీ, దొంగ తనం చేయకూడదనీ ఒకపిచ్చి ఉండేది. అందుచేత పక్కవాడి పలక చూచి తప్పు దిద్దుకోలేదు. మాస్టరుకు భలే కోపం వచ్చింది. ఇన్‌స్పెక్టరు పోయిన తర్వాత గాంధితాతను పిలిచి — "నీకు బుద్ధిలేదా? నేను పక్కకుర్రవాడి పలక చూసి నిన్ను దిద్దుకోమనలా? ఎందుకు దిద్దుకోలేదూ?" అని అడిగాడు.

"నేనీ బళ్లోనించి పొమ్మన్నా పోతాను గాని చచ్చినా దొంగతనం చేయను," అన్నాడు గాంధీ తాత మాస్టరుతో. చూశారా ఇలాంటి మొద్దుపనులు చేసే ఆయన తాతయ్య అయ్యాడు. లేకపోతే మనందరికీ ఒకే తాతయ్య ఎలా దొరికే వాడు?

ఏనిగయ్య: 'ఏమోయి మిస్టర్ తిమ్మన్నా! నాక్కూడా ఒకటి పడేస్తావా? ఎక్కి రమ్మంటావా?'

ఇంకొక విచిత్రమైనకథ. గాంధితాత 12 ఏళ్ళవాడై వుండగా ఆయనఅన్నగారు ఊళ్లో 25 రూపాయలదాకా చిల్లరబాకీలు చేశారు. కాని తండ్రికి తెలియకుండా తీర్చే ఉపాయం తోచలేదు అతనికి. అన్నదమ్ములు ఇద్దరూ కూడబలుకుకొని, ఏలాగైతేనేం ఒక నిర్ణయానికి వచ్చారు. అన్నగారిచేతిని బంగారం మురుగు ఉంది. దాన్ని కొంచెం నరికించి బాకీ తీర్చుదామనుకున్నారు. గాంధితాత ఈ పనిచేశాడేకాని గుండె దడదడా కొట్టుకుంటూనే ఉన్నది. తండ్రిగారు తన్ను కొడతారనీకాదు, కొరతను వేస్తారనీకాదు. గాంధిగారితండ్రి పిల్లలు తప్పుచేస్తే తను బాధపడేవారు; చేతులతో తల ఊరక బాదుకునేవారు. అలాంటప్పుడు ఈ తప్పు తెలిస్తే తండ్రిగారు ఎంత బాధపడతారు! తన్ను శిక్షించితే ఫర్వాలేదుకాని, తండ్రిగారు బాధపడతారుకదా. ఇక జన్మజన్మానికి మళ్ళీ దొంగతనం చేయగూడదని మన తాతయ్యచెంపలు వేసుకొన్నాడు. ఐనా ఆయనబాధ పోలేదు. చేసినపని తండ్రిగారితో చెప్పితీరాలనుకొన్నాడు. ఎలా చెప్పటం? ఈ మాట వింటే ఆయన మనస్సు ఎంత నొచ్చుకుంటుంది? ఒకవేళ చెప్పినా దానికితగ్గశిక్ష వేయడేమో? తాతయ్య మనస్సు వెనక్కూ ముందుకూ గుంజింది. జరిగింది చెప్పివేస్తేనేకాని పాపం పోదనుకొన్నాడు తాతయ్య.

వెంటనే తండ్రిగారికి ఇలా ఉత్తరం వ్రాశాడు :

"నాన్నగారికి, ఇంతటి బుద్ధితక్కువ పని చేసినందుకు విచారపడుతున్నాను. అన్నగారి బాకీ తీర్చటానికని మురుగుబంగారం కొంత నరికించి అమ్మివేశాను. ఇంతకన్న పెద్ద తప్పు మరేముంది? దీనికి తగ్గ శిక్ష మీరు నాకు తప్పకుండా వెయ్యాలి. ఈ ఉత్తరం చూచింతరువాత మీరు ఏమాత్రం విచారపడవద్దు."

ఈ ఉత్తరం మన తాతయ్య తనే పట్టుకెళ్ళి తండ్రిగారికి ఇచ్చాడు. ఆయన అప్పుడు జబ్బుపడి మంచంలో ఉన్నాడు. ఉత్తరం అందుకొని ఆయన లోలోపల చదువుకో సాగాడు. వారి కళ్లనించి కన్నీటి చుక్కలు టొటటొట క్రింద పడినాయి. అది చూడగానే గాంధితాతకు కూడ టపటపా కన్నీళ్ళు రాలాయి. కరంచంద్‌గారు అమిత ఆనందంతో, పొంగివచ్చే వాత్సల్యంతో కన్నీళ్లు నించితే, మన తాతయ్య తాను ఎంత తప్పుపని చేశానన్న విచారంతో కన్నీళ్లు నించాడు. ఇందులో ఎవరి కన్నీళ్ళు



"ఏంబాబూ! నాడాలు వేయించుకుంటారా?"
"ఏమిరా? నేను గుర్రాన్ని అనుకున్నావా?"

గొప్పవో మీరు చెప్పగలరా? లేక ఆ విక్రమార్కుడే దిగివచ్చి చెప్పాలంటారా?

కరంచంద్ కుమారుని ఉత్తరం చదివి మెల్లగా చించివేశాడు. కొడుకును దీవించాడు. గాంధీ తాతయ్య మనసు కుదుటపడింది.

ఇలాంటి సత్యసంధతవల్లనే గాంధిజీ మనందరికీ తాతయ్య అయ్యాడు. ప్రపంచానికి మహాత్ముడయ్యాడు.




అనగా అనగా ఒక ఊళ్లో ఒక చెమిటివాడూ ఒక గుడ్డివాడూ ఉండేవాళ్లు. వాళ్లిద్దరికీ మాంచి సావాసం. ఇద్దరూ ఆ ఊళ్లోనే అడుక్కుతిని బతికేవాళ్లు. కాని ఒక్కఊళ్ళో ఎన్నాళ్లు దొరుకుతుంది వాళ్లకు బిచ్చం? అందుకని ఆ ఊరువదిలి దూరదేశాలు పోయి బతుకుదామని ఇద్దరూ కలిసి బయలుదేరారు.

దోవలో గుడ్డివాడు చెమిటివాడితో— "ఇదుగో చెమిటి మామా! మనిద్దరంఒక మాటకు వద్దాము. నేను విన్నదెల్లా నీకు చెప్పుతాను నువ్వు చూసిందెల్లా నాకు చెప్పు. మనకు దొరికిందెల్లా చెరిసగం పంచుకుందాము." అన్నాడు.



చెమిటివాడు ఎగిరి గంతేసి 'సరే!' నన్నాడు. కొంతదూరం పోయేవరకు గుడ్డివాడికి గాడిద అరుపు వినిపించింది. "ఇదుగో, ఇక్కడ దగ్గరలో ఎక్కడో గాడిద ఉంది. దాన్ని పట్టుకు తీసుకెళ్లామా, మనకు ఏది దొరికినా దాని మీద వేసుకోవచ్చు." అన్నాడు.

చెమిటివాడు గుడ్డివాడు చెప్పిన దోవనే పోయాడు. అక్కడ ఒక గుంజకు గాడిద కట్టేసి ఉంది. చెమిటివాడు దాన్ని విప్పి తోలుకు వచ్చాడు.

ముగ్గురూ మళ్లీ కొంచెం దూరం పోయా

రు. చెమిటివాడు అన్నాడు: "ఇదుగో, గుడ్డిమామా! ఇక్కడ చీమలబారు పోతున్నది" అన్నాడు.

"ఇంకేం, కాసినితీసి పైపంచను మూటకట్టు. ఎందుకైనా పనికిరాక పోతయా?" అన్నాడు గుడ్డివాడు.

ఇంకా కొంచెందూరం పోయేవరకు చాకలివాడి బాన కనిపించింది. దాన్ని కూడా తీసుకుని గాడిదమీద కట్టుకుని బయలుదేరారు.

ఇంతలో పొద్దుకూకవచ్చింది. ఆకాశాన దట్టంగ మబ్బుపట్టింది. ఉరుములూ మెఱుపులతో వానవచ్చింది. దగ్గరలో ఏది కనపడినా చాలు, అందులో తల దాచుకుందా మనుకున్నారు ఇద్దరూ. అలాగే కాస్తైదూరం పోయేవరకు పెద్ద మేడ కనిపించింది.

"అదుగో, పేద్ద మేడ!" అన్నాడు చెమిటివాడు.

"అయితే నా చెయ్యిపట్టుకు నడు గెత్తు! నా చెవులు ఉఱుములమోతకు పగిలిపోతునై్న." అన్నాడు గుడ్డివాడు.

"నాకు ఉఱుములంటే లెక్కలేదు. మెఱుపులతో నా కళ్ళు పోతునై్న!" అన్నాడు చెమిటివాడు.

"ఎందుకుమామా, మనిద్దరం ఊరికే వాదించుకోటం. త్వరగాకొంపకు చేర్చు. తడిసిపోతున్నాం" అన్నాడు గుడ్డివాడు.

ఇద్దరూ ఆ కటిక చీకట్లో తడుస్తూ ఇంటికి చేరుకున్నారు. గుడ్డివాడు ఆ యింటి మెట్లూ, తలుపులూ గడియలూ చూసి "ఇది ఎవడిదో రక్షసుడి కొంప లాగా ఉంది. మనం ఇంకోచోటికి పోదాం" అన్నాడు.

చెమిటివాడికి భయంవేసింది. కాని



ఎక్కడికి పోతాడూ? ధైర్యం తెచ్చుకుని—"దీంటోకే పోదాంపద గుడ్డిమామా! రాక్షసివస్తే నేను జవాబు చెప్పుతాను." అన్నాడు.

ఇద్దరూ బలమంతా ఉపయోగించి తలుపునెట్టి గాడిదను లోపలికితోలి మళ్లీ తలుపుబిగించారు. లోపల రాక్షసీ లేదు, గీక్షసీ లేదు. వాళ్ళకు బాగా ఆకలి వేస్తున్నది. అన్నమూ, కూరలూ, పళ్లూ పెట్టి ఉన్నవి. గాడిదను స్తంభానికి కట్టివేసి ఇద్దరూ కూచుని ఆ అన్నమంతా మెక్కారు. కడుపు నిండేవరకు వాళ్ళకు నిద్రవచ్చింది. గురకపెట్టడం మొదలుపెట్టారు.

ఇంతలో ఎక్కడో తిరగటానికి పోయిన రాక్షసి వచ్చాడు. తలుపులు బిగించి ఉండేవరకు వాడికి కోపం వచ్చింది. "ఎవ్వడోయ్ లోపల! తలుపు తీస్తారా, మిమ్మల్ని పచ్చడి చెయ్యమంటారా?" అని కేకవేశాడు.

ఈ కేకతో గుడ్డివాడికి మెలకువ వచ్చింది. గజ గజ వణుకుతూ చెమిటివాడిని లేపి "విన్నావా కేక! రాక్షసి వచ్చాడు!" అన్నాడు.

"నాకు వాడి కేకలంటే లెఖ్ఖలేదు. నువ్వుఊరుకో నేను జవాబుచెప్పుతాను." అని, చెమిటివాడు రాక్షసిని దబాయించాడు: "ముందు ఎవడివోయి నువ్వు? హాయిగా నిద్రపోయేవాళ్లనివచ్చి లేపుతావు!"

"నేనా? రాక్షసుణ్ణి. ఇది నా యిల్లు. తలుపు తియ్యకపోతే మీ ప్రాణాలు తీస్తాను." అన్నాడు రాక్షసుడు.

"నువ్వు రాక్షసుడివైతే, మేము గీక్షసులం. ఏమనుకున్నావు? మేము రోజూ రాక్షసులనే తింటాము అన్నంలో." అన్నాడు చెమిటివాడు బిగ్గిరిగా.



రాక్షసికి ఆశ్చర్యంవేసింది. "ఏమిటీ! మీరు రాక్షసుల్ని తినే గిక్షసులా? ఏదీ పొట్టచూపించండి నేను నమ్ముతాను" అన్నాడు రాక్షసుడు.

"అయితే కిటికీదగ్గరికిరా చూపుతాను." అన్నాడు చెమిటివాడు. రాక్షసి కిటికీదగ్గరకు వచ్చేవరకు గుడ్డివాడు చాకలిబాన తీసుకుపోయి కిటికీకి అడ్డం పెట్టాడు. రాక్షసి ఆబాన తడివిచూసి.

"అమ్మయ్యో! ఎంతపెద్ద పొట్ట! అయితే బాబూ మీ తలకాయకూడా చూపుతారా?" అని అడిగాడు రాక్షసుడు.

గుడ్డివాడు గాడిదను లాక్కువచ్చి కిటికీముందు నిలబెట్టాడు. రాక్షసుడు గాడిదతల తడివిచూసి 'బాబో' అనుకున్నాడు లోపల. కాని బయటికి కనపడనివ్వకుండా "బాబూ! మీ అరుపుకూడా కాస్తె వినిపిస్తారా?" అని అడిగాడు.

గుడ్డివాడు మూటలో ఉన్న చీమల్ని తీసి గాడిద చెవులో పోశాడు. గాడిద తల అల్లల్లాడించి బిగ్గరగా, చెవులు పగిలిపోయేటట్టు ఓండ్రపెట్టింది.

పాపం! రాకాసికి హడలుపుట్టి ఆ అర్ధరాత్రే అడివిలోకి పారిపోయాడు.






మీకు నేను ప్రతిరాత్రీ ఒకేవేళకు కనిపించను. అప్పుడప్పుడు అసలురాను. అందువల్ల నేను మంచివాడిని కానని అనుకొనేరు. తల్లితండ్రులంటే నాకు భయభక్తులున్నాయి. చదువుసంధ్య లేకుండా నేను అల్లరిచిల్లరిగా తిరగటం లేదు. నిజంగా నాకథ తెలిస్తే ఇలా ఎందుకు జరుగుతున్నదో మీకే తెలుస్తుంది. నామీద మీకు అంత అపనమ్మకం ఉండదు. నాకు ప్రతిరోజూవచ్చి మీతో ఆడుకోవాలనే ఉంది. మీకు ఎన్నోకథలు చెప్పాలనీ ఉంది. కాని ఏమిచెయ్యను?

చాల ఏళ్లకిందట,—లక్షలు, కోట్ల సంవత్సరాల క్రిందట, అప్పటికి మనిషి ఇంకా పుట్టలేదు; జంతువు పుట్టలేదు; చెట్టు పుట్టలేదు; నీళ్లుకూడా లేవు. అప్పుడు మా అమ్మ నన్ను కన్నది. మా అమ్మను మీ రెరగరూ? మీరుంటున్నది మాఅమ్మ ఒళ్లోనేగా. భూదేవి మా అమ్మ. మా అమ్మ సూర్యునికూతురు. మా అమ్మ చిన్నప్పుడు మాతాత సూర్యుడిలాగా ఉండేదట. నేనుకూడా ఎరుగుదునుగా; నా చిన్నతనంలో మా అమ్మ ఎలా ఉండేదని! నా కళ్లుకూడా సరిగా చూడనిచ్చేవికావు. మా అమ్మ పుట్టినప్పటి నుంచి గిరగిరా గిరగిరా మా తాత చుట్టూ బొంగరాలు తిరుగుతూ ఆడుకొంటూ వుండేది. ఆనాటి ఆటలే మా అమ్మకు ఆచారమైపోయింది. ఏదన్నా మానుతుందేమోకాని మా అమ్మ ఆ అలవాటు వదిలిపెట్టదు.

ఇలాఉండగా నేను పుట్టాను. పుట్టి కాలు వచ్చింతరువాత ఒకచోట ఎలా కూచుంటాము. కాలుచేతులు ఊరుకోనిస్తాయా? నేనూ మా అమ్మకొంగు వదలిపెట్టకుండా ఆమెచుట్టూ అల్లాబిల్లీ



తిరిగేవాణ్ణి. చుక్కలు ఎంతో ప్రేమతో పిలిచేవి కాని నేను మా అమ్మను వదలిపెట్టేవాణ్ణికాను. చుక్కమ్మలు నన్ను ఎగతాళిచేసేవి. నేను ఆడంగి వాడిననీ, అమ్మ కొంగు వదిలిపెట్టననీ. ఆ రోజుల్లో నేను మా తాత సూర్యుడి లాగా వుండేవాణ్ణి. అందుకని అందరూ నన్ను ఎత్తి ముద్దులాడ పిలిచేవాళ్ళు. మా అమ్మకు నన్నుచూస్తే ఎంతో సంతోషం. నా ఆటపాటలకు మురిసి చక్కని అద్దం ఇచ్చింది.

మీకు అద్దం ఇస్తే ఏం చేస్తారు? ముఖం చూచుకోరూ? నేనూ ఆ పొరపాటే చేశాను. అద్దంలో చూచుకున్న కొందికి నాముఖం నాకే ఎంతో అందంగా కనిపించసాగింది అలా చూచుకొంటూ వుంటే ఇక ప్రపంచంలో మరోటి అందమైనది ఉన్నట్లే కనిపించేది కాదు. అందువల్ల ఎప్పుడూ అదేపనిగా నన్ను నేను అద్దంలో చూచుకొనేవాణ్ణి. మా అమ్మ చివాట్లు పెడుతూవుండేది. నేను వింటేగా? ఇలా చేయగా చేయగా కొన్నాళ్ళకు నా కాంతి అంతా పోయింది. ముఖం మాడిన అట్ల పెనంలాగా అయిపోయింది.

నాకు పుట్టెడు ఏడుపు వచ్చింది. చుట్టూచూచాను. చుక్కలు మిలామిలా మెరుస్తున్నాయి. ఎదురుగా చూచాను








మాఅమ్మ జ్యోతిలాగా వెలిగిపోతున్నది. మాఅమ్మకు ప్రక్కగా చూచాను. మా తాత ఎలావున్నాడని? చూడటానికి కళ్లు చాలకుండా ఉన్నాయి. నన్ను నేను చూచు కొన్నాను. నాఒళ్లు నాకే కనిపించలేదు.

నాకు పట్టరాని యేడుపు వచ్చింది. పోయినకాంతి ఎలా తిరిగి సంపాదించ టం? ఆలోచించాను, ఏమీ పాలుపోలేదు. దిగాలుపడి కూర్చున్నాను. అప్పుడే ఆకాశంలో చుక్కమ్మ కిటికీ మిలమిల లాడింది. చప్పున ఒక ఉపాయం తోచింది. అక్కడనుంచి ఒక్క గంతులో పోయి చుక్కమ్మ ఇంటి తలుపు తట్టాను. ఆమె తలుపు తీయకుండానే "ఎవరది, ఎందుకొచ్చావు" అని కిటికీలోనుంచే గద్దించింది.

"నేనే, చుక్కమ్మా, చందమామను. కాస్త వెలుగుపెట్టవూ?" అన్నాను.

"ఛో, ఛో! ఇప్పుడు కావలసివచ్చా నేం నేను? నల్లటి అట్ల పెనంమొహమూ నువ్వూ?" అని కసిరింది.

మీ అక్కయ్య బొమ్మ యియ్యక కరిసితే ఎలావుంటుంది? నాపనీ అంతే అయింది. కాళ్ళీడ్చుకొంటూ ఇంకొక చుక్కమ్మ యింటికి వెళ్లాను.

"ఇక్కడ మాకే లేకపోతే నీ మొహానికెక్కడ ఇవ్వమంటావు, వెలుగు?" అని మూలగింది ఆమె. తతిమ్మా చుక్కమ్మలూ యిలాగే అన్నాయి. ఇక ఏమిచేసేది? బావురు మని ఏడ్చాను.

అప్పుడే మాతాత సూర్యుడు జ్ఞాపకం వచ్చాడు. వెంటనే ఒక్కగంతులో మా తాతయ్య యింటిముందు వచ్చిపడ్డాను. కాని లోపలికివెళ్ళటం ఎట్లా? తలుపు తీదామంటే చేతులు కాలిపోవూ? అంతగా మా తాతయ్య యిల్లు వెలిగి



పోతున్నది. నేను ఏడుస్తూ అక్కడే నుంచున్నాను. అంతలో మా తాతయ్య ఏడుగుఱ్ఱాల బండిలో వస్తూ నన్ను చూచాడు.

"నాయనా ఎందుకోయి ఏడుస్తున్నావు ? నాకు చెప్పవూ ? నీకేమి తక్కువ," అన్నాడు.

"తాతయ్యా, నాలోని మంటలన్నీ ఆరిపోయాయి. వెలుతురంతా పోయింది. నాకన్నా చుక్కలే బాగున్నాయి. ఈ మాడుచెక్కముఖంతో మీఅందరిమధ్య ఎలావుండేది ? తాతయ్యా, తాతయ్యా! నాకు కాస్త వెలుగివ్వవూ," అని జాలిగా అడిగాను.

తాతయ్య ఆలోచించి ఆలోచించి చివరికి అన్నాడు: "నువ్వుచాల పెద్దపొరపాటు చేశావురా. మీ అమ్మ యిచ్చిన అద్దం సరిగా వాడుకోలేక చెడిపోయావు. ఆ అద్దంపెట్టిచూస్తే ఎన్నిరంగులు కనిపించేవి ! ఎంతప్రపంచం కనిపించేది ? ఎన్ని విచిత్రాలు కనిపించేవి ! సరే జరిగిందేదో జరిగింది. ఇకమీదనన్నా నేను చెప్పినట్టుచెయ్యి. నీ అద్దం ఉంది చూశావూ? దానిమీద ఎప్పుడూ నాకాంతి పడుతూ ఉండేటట్టుగా పట్టుకో. ఆ అద్దంమీది వెలుతురు నీ ముఖానికి తిప్పుకో. అప్పుడు నీముఖం తెల్లగా ఉంటుంది." అన్నాడు.

అప్పుడు నాకు ఎంత సంతోషం కలిగిందనుకొన్నారు. నాటినుంచి మా తాతయ్య చెప్పినట్టు చేస్తున్నాను. ఆయన వెలుగును నా అద్దంలోపట్టి నావైపుకు తిప్పుకుంటూవుంటాను. నాముఖం మళ్ళీ ప్రకాశించ మొదలుపెట్టింది. అయితే అప్పుడప్పుడు మాఅమ్మ నా అద్దానికి మా తాతయ్యకు అడ్డం వస్తుంది. అందువల్ల మీకు సరిగా వేళకు కనిపించలేక పోతున్నాను. అంతేగాని మరేమీ లేదు.





ఎలికల ఇళ్లకు జవాబు



చెట్ల భాగాలకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 కా | ను | 2 క | ■ | గు | లా | బి |
| ర | ■ | 5 ఏ | 6 కా | రి | ■ | డ్డ |
| 7 ము | 8 ని | ■ | ళ్లు | ■ | 9 మే | లు |
| ■ | 10 జ | న్మ | ■ | 11 వా | న | ■ |
| 12 పా | ము | ■ | 13 సీ | ■ | 14 క | 15 ల |
| ధు | ■ | 16 భూ | త | 17 ము | ■ | గ్న |
| 18 క | లి | మి | ■ | 19 ద్ర | వ | ము |

పజిలు జవాబు

## చిక్కు మాట



సంపాదన: చావలి రామారావు



అబ్బాయిలూ!

అమ్మాయిలూ!

నేను ఐదు అక్షరాల దేవుణ్ణి!

నేను 'నడక' లో ఉన్నాను గాని పరుగులో లేను.

'రంభ' లో ఉన్నాను కాని 'మేనక' లో లేను.

'సింహము' లో ఉన్నాను కాని 'పులి' లో లేను.

'హరి' లో ఉన్నాను కాని 'బ్రహ్మ' లో లేను.

'పాము' లో ఉన్నాను కాని 'తేలు' లో లేను.

పిల్లలూ! నేను ఎవరు?

---

జవాబు 61 పేజీలో చూడండి.




# దొంగముచ్చు (పోటీవ్యాసం)

మొదటి బహుమానం రు. 10/- రెండవ బహుమానం రు. 5/-

ముద్దులకోడళ్లూ, అల్లుళ్లూ!

మీరు బళ్లో "ఆవు నాలుగుకాళ్ల జంతువు. దాని కొక తోకయుండును. తోకతో అది ఈగలను తోలుకొనును. ఆవుకు రెండు కొమ్ములుండును. కొమ్ములతో అది పొడుచును. ఆవు నెమరువేయు జంతువు. అది అంబా యని అఱచును." ఇలాంటి వ్యాసాలు వ్రాసేవుంటారు. ఇంకా గుర్రముమీదా, పేరాశగల కుక్కమీదాకూడా వ్రాసిఉంటారు, అయితే ఇవి అన్నీ మీరు వాచకపుస్తకాల్లో చదివినవే. కాని, పుస్తకంలో చదివినవి కాకుండా మీరు కంటితో చూచినవి వ్రాయటం నేర్చుకోవాలి. అప్పుడు మీకు స్వతంత్రంగా వ్రాసేశక్తి వస్తుంది.

చూడండి, మీ బళ్లోగానీ, మీ ఇంటోగానీ, మీ ఇంటిపొరుగునగానీ అనేక రకాల పిల్లలు ఉంటారు. వాళ్లలో పైకి బాగా ఉంటూ ముచ్చుగా ఉండేవాళ్లూ, కుళ్లబోతులూ ఉంటారు. వీళ్ల కూబిగా ఉంటూ ఎన్నో చిలిపిపనులు చేస్తారు. ఇలాంటివాళ్లకు మనం 'దొంగముచ్చు'లని పేరుపెడదాం. ఇలాంటి ఒక దొంగ ముచ్చుచేసే పనులు అరపేజీకి తగ్గకుండా, పేజీకి మించకుండా నాకు వ్రాసి పంపండి. నేను చక్కగా బొమ్మలుగీయించి బాగా ఉన్నవి అచ్చువేస్తాను. మీరు వ్యాసంతో డబ్బు ఏమీ పంపనక్కరలేదు. అన్నిటిలోకీ బాగా ఉన్న రచనకు పదిరూపాయల విలువగల బహుమతి యిస్తాను. రెండోదానికి అయిదు రూపాయల విలువగల బహుమతి. ఇంకా బాగా ఉన్నవి ఉంటే చిన్న చిన్న బహుమతులు ఇస్తాను. మీ వ్యాసాలు ఈ చిరునామాకు పంపండి.

చందమామ వ్యాసరచన పోటీ
37, ఆచారప్పన్ వీధి, మద్రాసు.




అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు పెద్దవాళ్లసహాయం లేకుండా సొంతంగా ఆలోచించి ఈ పజిలు పూర్తి చేయాలి సుమా. అలా పూర్తిచేసి 58 పేజీలో ఉన్న జవాబుతో సరిచూసుకోండి. ఒక్క తప్పుకూడా లేకపోతే మీకు పది మార్కులు. ఒక తప్పుంటే ఆరు మార్కులు. రెండు తప్పులుంటే నాలుగు మార్కులు. మూడు తప్పులుంటే రెండుమార్కులు. నాలుగుగాని అంతకుమించిగాని తప్పులుంటే మాత్రం బండిసున్నా వచ్చినట్లే.

పోతే,దీన్ని పూర్తిచేసేపద్ధతి మీకు తెలుసునా? 1 నెంబరు అడ్డంలో మూడు అక్షరాలు వుండాలి. ఆధారములలో "బహుమతి" అని వుందా, దానికి మూడు అక్షరాల మాట ఏమైయ్యుండాలి అని ఆలోచించాలి. అప్పుడు "కానుక" వస్తుంది. అక్కడ 'కానుక' ఉంచండి.

అలాగే 1 నెంబరు నిలువు మూడు అక్షరాలు వుండాలి, దానిని వెతకటానికి "నాలుక మంట పుట్టించేది" ఏదా అని చూడాలి. దాని మొదటి అక్షరం "కా" - యిది ఏమబ్బా అని ఆలోచిస్తే "కారము" గుర్తుకు వస్తుంది. అట్లాగే తతిమ్మా గళ్లు పూర్తిచేసి మీ మార్కులు నాకు చెప్పండి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 కా | ను | 2 క | ■ | 3 | లా | 4 |
| ర | ■ | 5 | 6 | | ■ | డ్డ |
| 7 ము | 8 | ■ | ళ్లు | ■ | 9 | |
| ■ | 10 | స్మ | ■ | 11 | నే | ■ |
| 12 | ము | ■ | 13 | ■ | 14 | 15 |
| | ■ | 16 | | 17 | ■ | గ్న |
| 18 | లి | | ■ | 19 ద్ర | | |

## ఆధారములు

**అడ్డము:**

1. బహుమతి
3. ఒక పువ్వు
5. ఒక సంవత్సరము పేరు
7. ఋషి
9. కీడుకు వ్యతిరేకము
10. పుట్టుక
11. వర్షము
12. సర్పము
14. స్వప్నము
16. దయ్యము
18. సంపద
19. నీటిలాగా ఉండునది.

**నిలువు:**

1. నాలుక మంట పుట్టించేది
2. కవిత్వము చెప్పును
3. —ఇది లేంది గోలీకి గోలీత గలదు.
4. పిల్లలు
6. మనం నడిచేది వీటితోనే
8. అబద్ధము కానిది
9. శకుంతలతల్లి
12. కాలికి తొడుగునది
13. శ్రీరాముని భార్య.
15. ముహూర్తము
16. నేల
17. సీలు వేయునది.

58 పేజీలో చిక్కుమాటకు జవాబు

'నరసింహము'



ఈ బొమ్మ, మా ఊర్లో ఓ మేస్టరుది. పిల్లలూ ఇతని మొహం చూశారా, ఎవరైనా సరీగా అన్సరు చెప్తే ఇలాగే నవ్వుతాడు. కాని సరీగా అన్సరు చెప్పకపోతే అతని మొహం తిరగేసి చూడండి. ఎంత కోపంగా చూస్తున్నాడో. ఇల్లాంటి మేష్టర్లు ఉండ కూడదు కదూ!

బొమ్మ వేసినది:

శీతాపతిరావు అన్నయ్య

బరంపురం.

## గొలుసు మాట

చాలు చాలు - ఏమి చాలు?
నెయ్యి చాలు - ఏమి నెయ్యి?
గొల్ల నెయ్యి - ఏమి గొల్ల?
పాల గొల్ల - ఏమి పాలు?
బఱ్ఱె పాలు - ఏమి బఱ్ఱె?
పాడి బఱ్ఱె - ఏమి పాడి?
ఇంటి పాడి - ఏమి యిల్లు?
మామ యిల్లు - ఏమి మామ?
చందమామ

సంపాదన: కాశీపల్లి శకుంతల, బందరు.

## ఎలికలకు ఇళ్లు



ఈ సున్నాలో పది ఎలికెలు ఉన్నాయి. ఈ సున్నాలో మరిమూడు చిన్న సున్నాలు గీసి, ఒక్కొక్క ఎలికెకు ఒక్కొక్క ఇల్లు వచ్చేటట్టుచేయాలి. చేయగలరా? లేకపోతే 58 పేజీలో చూడండి. మీకు తెలిసిపోతుంది.

## చెట్ల భాగాలు



ఈ చదరంలో పన్నెండు చెట్లు ఉన్నాయి. ఈ భూమినీ, చెట్లనూ నలుగురు అన్నదమ్ములు సమానంగా పంచుకోవాలి. ఎవరికీ ఎక్కువ తక్కువ ఉండకూడదు. భాగించటం మీకు చేతకాకపోతే 58-వ పేజీ చూడండి తెలిసిపోతుంది.

## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

మీరు మీ అక్కలూ, అమ్మలూ, అవ్వలూ పాడుతుంటే ఎన్నోపాటలు వినిఉంటారు. అవి కాగితంమీద రాసి పంపండి. అచ్చువేసి చిన్ని చిన్ని బహుమానాలు పంపుతాను. ఇంకా పిట్టకథలూ, అమ్మమ్మ చెప్పిన శాస్త్రాలూ అన్నీకూడా పంపండి. చక్కగా బొమ్మలతో అచ్చువేద్దాము. పంపుతారు కదూ? రచనలు ఈ క్రింది చిరునామాకు పంపండి.

సంపాదకుడు

**చందమామ**

37, ఆచారప్పన్ వీధి, మద్రాసు 1




[ప్రతి ఆదివారం మధ్యాహ్నం 2.15 నుంచి 3 గంటలవరకు 211, 31.3 మీటర్లమీద వినవచ్చు]

## జూలై నెల ప్రోగ్రాములు

### 6 వ తేదీ ఆదివారం

పిలుపు పాట
ఉత్తరాల సంచి
పడవ పిల్ల (నాటిక)
పుట్టినరోజు పండుగలు
వరదల్లో (రూపకం)
చిక్కు ప్రశ్న
మీ పాటలూ, కథలూ.
పోదామా!

### 13 వ తేదీ ఆదివారం

రారె చిన్న పిల్లలార
ఉత్తరాల సంచి
బంగారు బొమ్మ (నాటిక)
పుట్టినరోజు పండగలు
పూలపల్లకి (పాతకథ)
చిక్కు ప్రశ్న
మీ పాటలూ, కథలూ
పోదామా!

### 20 వ తేదీ ఆదివారం

పిలుపు పాట
ఉత్తరాల సంచి
తమాషాల గుత్తి (వినోదాలు)
ఇంద్ర ధనుస్సు (సంగీత నాటిక)
పుట్టినరోజు పండుగలు
తాతయ్య కథ
పోదామా!

### 27 వ తేదీ ఆదివారం

రారె చిన్ని పిల్లలార
ఉత్తరాల సంచి
మంచి భూతం (నాటిక)
పుట్టినరోజు పండుగలు
పొట్టి బావ కథ
పోదామా!

## తల్లీ — పిల్లా

పాపలు ఎండుగాను పీలగాను ఎందుకు వుంటారు?

తల్లులు బలంలేకుండా జబ్బువారైతే వారికి పుట్టిన పిల్లలుకూడా అలాగే వుంటారు.

స్త్రీల జబ్బులకు మంచిమందు ఏదంటే

# లోధ్ర

ఈ పేరు అందరూవిన్నదే - అయినా దీనిని గురించి మీ అమ్మతో చెప్పండి.

*

"లోధ్ర" దొరికే చోటు:

## కేసరీకుటీరము లిమిటెడ్

రాయపేట :: మద్రాసు 14

---

*For Entire Satisfaction ....*

*Use Inks Manufactured by*

**COATES BROS & CO. LTD., LONDON**

WE STOCK & SUPPLY THEM

**K. ORR & CO.**

PRINTERS' PROVIDERS

**40, Chinnathambi St. : MADRAS-1**

*also*

SOLE AGENTS FOR:

**SAMUEL JONES & CO. (EXPORT) LTD., LONDON**

MANUFACTURERS OF GUMMED PAPERS, TAPES, ART PAPER AND ALSO EXPORTERS OF ALL KINDS OF PAPER

*Inks used in this Journal are* **"COATES"**



Printed and Published by B. N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras 1.
Editor: CHAKRAPANI.



*Chandamama July '47* *Photo by N. Ramakrishna*

కొంచెం ఆగండి! మీకు జవాబు చెప్పుతాను!

వాహినీవారి

# యోగి వేమన

డైరెక్టరు - కే.వి.రెడ్డి, B.Sc (Hons)




అందాలు చిందేటి నా జ్యోతీ
ఆనంద మొలికేటి నా జ్యోతీ

ఆ కంటిలో జ్యోతి - యీ కంటిలో జ్యోతి
రెండు కన్నులలోన - నిండియున్నది జ్యోతి

నా మనసులో నుండి - నవ్వించు జ్యోతీ
నా మాటలో నిండి - నడిపించు జ్యోతీ

తొలికారు మబ్బులో - తొంగిచూచే జ్యోతి
పసిపాప నవ్వులో - పండి విరిసే జ్యోతి.

చిట్టిజ్యోతికి వేమన పాడిన జోలపాట
చందమామ ముద్దుకోడళ్లకు లాలిపాట



PRINTED AT THE B. N. K. PRESS, MADRAS - 1.